# ప్రేమ చంద్రులు

కృతికర్త:

ఉపదేశక, భక్తితిలక.

## యల్లాపంతుల జగన్నాథం. బి.ఏ



ప్రకాశకులు

వేంకట్రామ అండ్ కో.

విజయవాడ. మద్రాస్.

# ప్రేమ చంద్రులు

[విశ్వప్రేమమయులగు మహాపురుషుల జీవిత కథలు]

కృతికర్త:
ఉపదేశక, భక్తితిలక
యల్లాప్రంతుల జగన్నాథం, బి. ఏ.




పబ్లిషర్సు:
వేంకట్రామ అండ్ కో.,
విజయవాడ - మద్రాసు

1951

 [వెల రు 0-12-0

# పీఠిక

ప్రపంచమునం దే వ్యక్తియు నేఱొక వ్యక్తిని ప్రేమ చేత నాకర్షించినంత గాఢతరముగ మఱి దేని చేత నాకర్షింపఁజాలఁడు. నిర్మల ప్రేమగలవారి హృదయములు విశాలములై విశ్వపోషకములై యుండును. స్వార్థపరత్వము చేతఁ గలుషితమైన ప్రేమగల వారి హృదయములు సంకుచితములై భేదబుద్ధి కలిగి యుండును. నిర్మలహృదయముగలవారు జగత్తునంతను దమ కుటుంబముగ భావించుచుందురు. సంకుచిత హృదయముగలవారు తమ కుటుంబమునే సర్వ జగత్తుగ భావించుచుందురు.

నేఁడు విద్యార్థులుగ నున్న బాలబాలికలే సద్వర్తనగల భావి పౌరులై దేశమున కలంకారప్రాయులగుట కవకాశమున్నది కదా? బాల్యావస్థయందు వారల హృదయములు నిర్మలముగ నుండును. సహవాస దోషము చేత నవి కలుషితములు కాకముందే విశ్వప్రేమ ప్రభావము వారి చిత్తములకు హత్తుకొను రీతిని విద్యాశాఖాధికారులు పాఠశాలల యందు బోధించుట కనుజ్ఞ నిచ్చు టుచితము. ఉపాధ్యాయులు తాము ముందుగ నుదారస్వభావమును, ప్రపంచజ్ఞానమును పూర్తిగ సంపాదించి విద్యార్థుల కాదర్శప్రాయులై వారలకు విశ్వప్రేమ బోధ చేయవలసి యుండును. విశ్వప్రేమ బోధ చేయుటమాని యితర శాస్త్రబోధ లెన్ని చేసినను పునాదిలేని మేడలువలె నట్టి శాస్త్రబోధలు విద్యార్థుల హృదయ పీఠములందుఁ జిరస్థాయి నొందఁజాలవు.

మానవుల సంకుచిత స్వభావము వదలించి విశ్వప్రేమను స్థాపించుటకు భగవంతుఁడే మహాపురుషరూపమున లోకమునం దవతరించునని భారతీయుల విశ్వాసము. అట్టి మహాపురుషులగు గౌతమబుద్ధుఁడు, చైతన్యుఁడు, మెహెర్బాబా అనువారి జీవిత చరిత్రములు విద్యార్థులకుఁ మనోహరముగ నుండునట్లు సులభశైలిలో నిర్దుష్టముగ రచించి గ్రంథరూపము వహింపఁజేసినాను. విద్యా

శాఖాధికారులు పాఠశాలలయందు దీనినిఁ బఠనీయగ్రంథముగ నిర్ణయింతురేని విద్యార్థుల భావిజీవితమునకుఁ జక్కని పునాది ననుగ్రహించినవారగుచున్నారు.

హృదయాకాశమునఁ బ్రేమచంద్రుఁ డుదయించినప్పుడు ప్రేమ సముద్ర ముప్పొంగుటయు, జీవుల హృదయములు ప్రేమమయములై యుదార స్వభావము వహించుటయు సహజమే కదా ? పైనిఁ జెప్పిన ముగ్గురు నట్టి "ప్రేమ చంద్రు" లగుటచే వారలకు గౌతమచంద్రుఁడు, చైతన్యచంద్రుఁడు, మహమ్మదుచంద్రుఁడు ననెడి యన్వర్థనామము లిడితిని.

ఈ చిన్న గ్రంథమును దొరతనమువారును, విద్యాశాఖాధి కారులును పైనిఁ జెప్పిన విధముగ నాదరింతురుగాక. దీనిని రచింపుటకు నన్నెంతయుఁ బ్రోత్సహించి సంపూర్ణానుగ్రహముతో దీనినిఁ బ్రకటించిన వేంకట్రామ అండ్ కో., సర్వాధికారులగు శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారికి నేను కృతజ్ఞతా బద్ధుఁడను.

ఏలూరు
1 నవంబరు 1951

యల్లాప్రంతుల జగన్నాథం బి. ఏ;
ఉపదేశక, భక్తితిలక.

# ప్రేమ చంద్రులు

## శ్రీ గౌతమ చంద్రుఁడు

### శ్రీ గౌతమ చంద్రుని జననము.

సర్ ఎడ్విన్ ఆర్నోల్డ (Sir Edwin Arnold) ల్డనెడి సుప్రసిద్ధాంగ్లేయకవి శ్రీ గౌతమ బుద్ధుఁడు ఆసియాఖండమున కమరజ్యోతి యనియు, అక్షీణచంద్రుఁడనియుఁ జెప్పుటచే నేనీ యవతార మూర్తికి గౌతమచంద్రుఁ డనెడి నామ మిడితిని.

శ్రీ కాశీపట్టణమున కీశాన్యదిక్కున నూఱుమైళ్ళదూరమునఁ గపిలవాస్తు వనెడి నగర మొకటి యుండెను. క్రీస్తుశకమునకుఁ బూర్వము సుమారాఱువందల యేఁబది సంవత్సరముల క్రిందట నాపట్టణమును శుద్ధోదనుఁ డనెడి యొక రాజేలుచుండెను. ఇతఁడు సూర్యవంశమున శాక్యకులమందు జన్మించిన క్షత్రియుఁడు. ఆకాలమున శాక్యుల రాజ్య ముత్తర భారత దేశమందుఁ బ్రసిద్ధి కెక్కిన రాజ్యములలో నొకటి. కపిలవాస్తువు నేఁడు కోహానా యనెడి పేరుగల రోహిణీ నది యొడ్డున నుండిన యొక సుందరమైన పట్టణము.

శుద్ధోదనునకు మాయాదేవి, ప్రజాపతీదేవి యనెడి యిద్దఱు భార్యలు గలరు. వారిరువురు అక్కసెల్లెండ్రు. వారిద్దఱిలో మాయాదేవిమిక్కిలిదయార్ద్రహృదయురాలు, బీదలయెడ్డయు,

నాపన్నులయొక్కయు గష్టములు దీర్చుటకై యామె తన సర్వస్వము ధారవోయు చుండెడిది. కాని ప్రజాపతీదేవి మిగులఁ గఠినురాలు. తన సోదరియగు మాయాదేవి సద్వర్తనమామెకుఁ గంటక ప్రాయముగ నుండెను. నానాఁటికి మాయాదేవి కామె శత్రు ప్రాయురాలే యయ్యెను.

శుద్ధోదనుఁడు తన భార్యలిద్దఱితో ననేక సంవత్సరములు సంసార సుఖము లనుభవించు చుండినను సంతానవంతుఁడు కాఁడయ్యెను. తనకు వంశాంకురమును, తన యనంతరము రాజ్యభారము వహించువాఁడును నగు పుత్ర రత్నము తన కెప్పుడు కల్గునోయని యతఁడువ్విళ్ళూరు చుండెడివాఁడు. ఇంతటిలో నొక నాఁటిరాత్రి మాయాదేవి కొక స్వప్నము వచ్చెను. ఆఱు దంతములు గల యొక తెల్లని యేనుఁగు రూపము గలిగిన దేదీప్యమాన మగు నొక నక్షత్ర మంతరిక్షమునుండి బయలుదేఱి కాంతులు వెదజల్లుచుఁ గ్రిందికి వచ్చి మాయాదేవి గర్భమందుఁ గుడి తట్టునఁ బ్రవేశించెను. ఈ స్వప్నము రాఁగానే మాయాదేవి లేచికూర్చుండి తన శరీరము గగుర్పొడుచుటయు, దా నలౌకికమగు నొక వింత సుఖము ననుభవించుటయు గమనించెను. ఇంతేకాక నిశ్శబ్దమగు నా నడిరేయియందు "మృత్యురూప సంసారమందుఁ బడి నిద్రించుచున్న యో మానవులారా! మీరు త్వరగా మేలుకొని నా మాట లాలింపుఁడు. మీకుఁదరణోపాయము కలదు. ఇదే బుద్ధుఁడు వచ్చుచున్నాఁడు". అనెడి సుధామధురోక్తులు కూడ నామె చెవులకు వినవచ్చెను. ఆమె వెంటనే లేచి రాచ

నగరున కంటియున్న యుద్యానవనమునకుఁ బోయి తన స్వప్న వృత్తాంతము నాలోచించు కొనుచుఁ గూర్చుండెను.

ఆ రాత్రి యదే సమయమందు శుద్ధోదన మహారాజునకుఁగూడ స్వప్న మొకటి కలిగెను. ఆకాశమునుండి వింత వెలుఁగొకటి బయలుదేఱి తన పైపువచ్చుచుండెను. ఆ వెలుఁగు మధ్యనుండి జ్యోతిర్మయుఁడైన దివ్యపురుషుఁ డొకఁడు బయటికి వచ్చి "మహారాజా! ధర్మసంస్థాపన కొఱకు నేను నీకు పుత్రుఁడుగ జన్మించి యీలోకమం దవతరించుచున్నాను." అని చెప్పెను. ఈ స్వప్నము రాఁగానే రాజుగూడ మేల్కాంచి యుద్యానవనమునకుఁ బోయెను. అచటఁ గూర్చుండియున్న తన పట్టపుదేవినిఁ జూచి యతఁడాశ్చర్య చకితుఁ డయ్యెను. వారిరువురు దమ స్వప్నవృత్తాంతముల నొండొరుల కెఱింగించుకొనిరి. మఱునాటి దిన మీ వృత్తాంతము మహారాజు దైవజ్ఞుల కెఱింగించెను. అది విని మహాపురుషుఁ డొకఁడు మాయాదేవికి స్వల్పకాలములో జన్మించునని వారు చెప్పిరి.

ఇంతలో మాయాదేవి గర్భవతి యయ్యెను. తన సోదరికి మహాపురుషుఁడు జన్మించుట ప్రజాపతీదేవి కిష్టము లేదు. కనుక నామె నెట్లయిన చంపింపవలెనని యాలోచించెను. ఒక దాసిని బిలిచి తన యాలోచన చెప్పెను. ఆ దాసి తనకుఁ బ్రియుఁడైన రాచనగరు నందలి వంటవాని నొకని నాశ్రయించి మాయాదేవికి రాత్రి యతఁడనుదినము త్రాగుట కిచ్చెడి పాలలో విషము కలిపి యిమ్మని యతనిని బ్రార్థించెను. ఎంతయో కష్టము మీఁద నతఁడట్లు చేయుట కంగీకరించి పాలలో విషము గలిపెను. కాని యతఁడు బాగుగ నాలోచించి నిండు బాలాలినిఁ జంపుటకంటె తానే చనిపోవుట మేలని నిశ్చయించెను.

అపుడతఁ డాపాలనే త్రాగి మరణించెను. ఇది విని దాసి తన గుట్టు బయలు పడునని భయపడి నూతిలోఁబడి మరణించెను.

తాను జనిపోవకముందు వంటవాఁడు దాసికి వ్రాసి యుంచిన యుత్తర మొకటి శుద్ధోదనునకు దొరకెను. అతఁడది చదివి దీని కంతటికిఁ గారణమగు ప్రజాపతీదేవి నతఁడు శిక్షింపఁ దలచెను. తన పన్నుగడ బయలుపడుటచేఁ దనకుఁ గలిగిన సిగ్గును, బశ్చాత్తాపమును ప్రజాపతీదేవికిఁ జేయుచున్న శిక్ష చాలు ననియు, వేఱొక శిక్ష యనవసరమనియు మాయాదేవి చెప్పి మహారాజును వారించెను.

అంతలో మాయాదేవికి నెలలు నిండఁగాఁ గ్రీస్తుశకమునకుఁ బూర్వ మాఱువందల యిరువది మూఁడవ సంవత్సరమందు వైశాఖమాసమున శుద్ధపూర్ణిమనాఁడు కపిలవాస్తు నగరమున లుంబినీ యుద్యానమందలి యొక మహాసౌధమున జగదుద్ధారకుఁడగు మహాపురుషుఁ డుదయించెను. ఆ దినమందొక వింత జ్యోత్స్న ముల్లోకముల నావరించెను. పుట్టంధులకుఁ జూపు వచ్చెను. బధిరులకు వినికిడి యేర్పడెను. పిచ్చికుంటులు పరుగెత్తసాగిరి. వ్యాధిగ్రస్తులు నిరామయులైరి. కమ్మని చల్లని గాలి మెల్లన వీచెను. దేవగంధర్వ కిన్నర కింపురుష విద్యాధర గణములతోఁ జతుర్ముఖ బ్రహ్మకూడ భూలోకమున కవతరించెను. అతఁడు ప్రసూతిగృహమునఁ బ్రవేశించి శిశురూపుఁడైన యా మహాపురుషునిఁ దన రెండుచేతులతో నెత్తుకొని "ఓమహారాజ్ఞీ! ఏమి నీ మహాభాగ్యము! ముల్లోకములందును ధర్మమును బునరుద్ధరించుటకు సాక్షాత్తు భగవంతుఁడే నీగర్భము నుండి యవతరించినాఁడు." అనుచు నా బిడ్డను గొంతసేపు

లాలించెను. దేవగణముగూడ బిడ్డనుజూచి, "ఓమహాపురుషా! నీ దర్శనముచే మేము ధన్యులమైతిమి. నీవు సాక్షాత్తు భగవంతుఁడవు. నీతో సమానుఁడు లేఁడు. కనుక నీకంటె నధికుఁడెచ్చట నుండును?" అనుచుఁ గొంతసేపు కైవారముసేసి యా శిసువునకు వంగివంగి నమస్కరించి పోయిరి. బ్రహ్మాది దేవతలు వెడలిన వెంటనే యసితుఁడనెడి మహర్షి యొకఁడు శుద్ధోదనునిఁ జూడవచ్చెను. అప్పుడతఁడు తన బిడ్డను మహర్షికిఁ జూపెను. అప్పుడు మహర్షి యానంద పారవశ్యముతో బిడ్డకు సాష్టాంగ నమస్కారముచేసి, "చిన్ని బుద్ధుతనివలెఁ దోఁచునో మహాపురుషా! నీకు నమస్కారశతంబులు. నీ చిన్ని శరీరమునఁ దోఁచెడి యసంఖ్యాకములగు దివ్యలక్షణములును, నీ తనువు నుండి వెడలుచున్న పాటలవర్ణముగల జ్యోతియు నీ వవతరించిన భగవంతుఁడవనియే చెప్పక చెప్పుచున్నవి. ముల్లోకముల నిపుడావరించియున్న యజ్ఞానాంధకారమును నీవు పాఱఁద్రోలుదువు. మానవహృదయముల నన్నిఁటిని విజ్ఞానజ్యోత్స్నామయములుగను, ప్రేమసిక్తములుగను జేయుదువు. నీవు బుద్ధదేవుఁడవే. నేను జీవించి యుండగనే నీ దర్శనము లభించినందులకు సార్థకజన్ముఁడనైతిని." అనుచు నా బిడ్డను స్తుతించి శుద్ధోదనుని వంకకుఁ దిరిగి "మహారాజా! ఎన్నియో వేల సంవత్సరములు గడచినఁగాని మానవజీవిత వృక్షమున నీ బిడ్డ వంటి దివ్యపుష్పముదయింపనేరదు. అది యిప్పు డుదయించినది. ఇఁక నది తన దివ్య పరిమళముతో జగత్త్రియమును సువాసితమొనర్చును సుమా" అని చెప్పి యసితుఁడు వెడలి పోయెను. తదుపరి శుద్ధోదనుఁడు తన పుత్త్రునికి సిద్ధార్థుఁడని నామకరణము చేసెను.

మాయాదేవి పుత్త్రునిఁ గనిన యాఱవనాఁటి రాత్రి యిద్దఱు దివ్యపురుషులు వచ్చి తన నేదో యొక యానందమయమగు స్వర్గలోకమునకుఁ గొనిపోయిన ట్లామె స్వప్నముఁ గనెను. తానింక జీవించుట యసంభవమని తెలిసికొని యేడవ దినమునఁ దన భర్తను, సోదరియగు ప్రజాపతీదేవినిఁ బిలిపించెను. అప్పుడు తన స్వప్నవృత్తాంతము వారికిఁ జెప్పి ప్రజాపతీదేవితో, " సోదరీ ! వీఁడు నీ బిడ్డఁడుగాని నా బిడ్డఁడు కాఁడు. ప్రేమతోఁ బెంచుకొనుము" అని చెప్పి సిద్ధార్థు నప్పగించి యామె చనిపోయెను.

ప్రజాపతీదేవియొక్క లాలన పాలనములచే సిద్ధార్థుఁడు దిన దిన ప్రవర్ధమానుఁ డగుచుండెను. అతని యెనిమిదవయేట నుపనయన సంస్కారము జరిగెను. విశ్వామిత్రుఁడనెడి బ్రాహ్మణోత్తముఁ డొకఁడతనికి బ్రహ్మోపదేశము చేసెను. పూర్వజన్మ వాసనల ననుసరించి యతనికి శస్త్రాస్త్ర విద్యా నైపుణ్యము, సకలశాస్త్ర పారంగత్వము లభించెనేకాని యతఁ డెవరి యొద్దను వానిని నేర్చుకొనినవాఁడు కాఁడు.

## గౌతమ చంద్రుని జీవకారుణ్యము.

బాల్యము నుండియు సిద్ధార్థునికి జీవకారుణ్యము మెండు. హింస యనునది యతనితత్త్వమునకు విషప్రాయముగనుండెడిది. బాలక్రీడల యందనురక్తుఁడగు వేళ వేఁటాడఁబోయి యందు వలనఁ బశుపక్షులకు హింస కలుగునని మఱలి వచ్చెడివాఁడు. గుఱ్ఱపుఁ బందెములకుఁ బోయి గుఱ్ఱము లలసట నొందుటచూచి సగము గెలిచిన పందెములు గూడ వదలుకొనెడి వాఁడు. వసంత సమయమున నొకనాటి సాయంకాలము సిద్ధార్థుఁడు

రాజప్రాసాదమున కంటియున్న యుపవనమున విహారింపుచుఁ బ్రకృతి సౌందర్యము ననుభవించుచుండెను. అప్పుడు రాజహంసల శ్రేణియొకటి యాకాశమార్గమున నుత్తర ముఖముగ మానస సరోవరమువంకఁ బోవుచుండెను. ఆ యంచ పిండు నానందముతో రాజకుమారుఁడు తిలకించుచుండ నందులో నొకటి బాణనిహతమై సిద్ధార్థుని యొడిలో బడెను. గాయము వెంట రక్తము గాఱుచు నది బాధపడుచుండుట జూచిన సిద్ధార్థుని హృదయము నీరై పాఱెను. దాని శరీరమునుండి బాణము నుపాయముగ నతఁడూడఁ బెఱికెను. గాయమునకుఁ దేనె పూసెను; కొన్ని యోషధులను గట్టెను. ఇట్లు కొన్నిదినముల కతఁడు హంసకు స్వాస్థ్యము కలిగించి మఱల వియత్పథమున దానిని విడిచి పెట్టెను.

ఆ వసంత సమయమందే మఱియొక దినమున శుద్ధోధనుఁడు తనకుమారుని రథముపై నెక్కించుకొని రాజధానికి సమీపమునఁ బచ్చని పైరులతో నిండియున్న తన పొలములతనికిఁ జూపించుటకుఁ దోడ్కొని పోయెను. సిద్ధార్థుఁడు క్షేత్రసంపదనేకాక పొలములో నొక చోట సంతోషముతోఁ బనిసేయుచుండిన శ్రమజీవులను జూచెను. ఇంకొక చోట విత్తనములు నాఁటుచున్న సేద్యగాండ్రను జూచెను. వేఱొక చోట దున్నుచుండిన పొలమరులను జూచెను. అంతయు బయటి కానంద దాయకముగనే యుండెను. కాని యతని దృష్టి వేఱు విధముగ నుండెను. నేత్రపర్వము గలిగించెడి గులాబిపువ్వు ముండ్లతో నిండియుండునని యతనికిఁ దెలియును. కర్షకుని యానందము కొఱకు పొలము దున్నెడి వృషభములు మండు టెండలో బడెడిబాధ యతఁడు గ్రహించెను. అచ్చటనే వేఱొక

చక్కి దోమలను దినుచున్న కప్పను, కప్పను నోటఁ గఱచు కొన్న సర్పమును జూచెను. ఇది గని యొక ప్రాణి మరణించి నప్పుడే వేఱొక ప్రాణికి జీవికయేర్పడుచున్నదని యతఁడు తెలిసి కొనెను. పైకి మాత్ర మానంద దాయకముగఁ గనఁబడుచున్న మన జీవితమంతయు యథార్థముగ దుఃఖ మయముగను, బర హింసాకరముగను, గష్టభూయిష్ఠముగను, నున్నదని యతఁడు సులభముగ గ్రహించెను. కరుణామూర్తియగు సిద్ధార్థుని కిది మిగుల దుర్భరముగ నుండెను. అందువలనఁ దండ్రితో నొక మాటయిన నాడకుండఁ జింతాక్రాంతుఁడై యతఁడు నగరము నకు మఱలి వచ్చెను.

సిద్ధార్థుఁడు కరుణామూర్తియనియు, మానవదుఃఖములు నిర్మూలించుటకు మార్గము వెదకుటకై యొకానొక దినమున రాజ్యమునే విడిచి యతఁడు పోవచ్చుననియు జ్యోతిషికులు శుద్ధోదనునకుఁ బలుమాఱు చెప్పుచుండిరి. అందువలన భయపడి దుఃఖవాసనయైన నతని పొలిమేరకు రాకుండునటులు సిద్ధార్థుఁడు శీతకాలమునఁ దనపుత్త్రుఁడు నివసించుటకుఁ దొమ్మిదంతస్తుల మేడయొకటియు, వేసవికాలమున నివసించుట కైదంతస్తుల మేడ యొకటియు, వర్ష కాలమున నివసించుటకు మూఁడంతస్తుల మేడ యొకటియుఁ గట్టించెను. ఆమేడలచుట్టును సుందరములై సువాసనలుగల పుష్పములతో నిండియున్న యుద్యానవనము లను నిర్మించెను. ఆ వనములలో నందమైన ధారలతో నెల్ల వేళ లను నీరుబుకుచుండెడి జలయంత్రము లెన్నియో కలవు. మనో హరముగ గానము సేయునట్టి శుకపిక శారికాది విహంగములతో గూడుకొన్న నానాజాతి ఫలవృక్షములు పెక్కులు గలవు.

మఱియు నచట నిక్కుచు నీల్గుచు నేలపై నృత్యము లొనర్చు నట్టి మయూరములును గనుల పండువుగఁ దోఁచు చుండును.

## శ్రీ గౌతమ చంద్రుని వివాహము.

ఇంతటి యానందమగు వాతావరణమందుఁ గూడ దానింతకుఁ ముందు జూచియున్న చెమట యార్చి కష్టము చేయుచుండెడి శ్రమజీవులును, ముండ్ల కట్టెలపోటులు దినుచుఁ బొలము దున్నుచుండిన దుక్కిటెద్దులును, నితర జీవముల నాహారముగఁ గొనుచున్న జీవరాసులును సిద్ధార్థునికి మాటి మాటికి జ్ఞప్తికి వచ్చుచుండెను. ఇంత దుఃఖమయముగఁ బ్రపంచ ముండుటకుఁ గారణమేమై యుండునని దీర్ఘముగ నాలోచింపుచుఁ దదేకదృష్టితో నతఁడా మేడలయందు దినములు గడపు చుండెను. ఇది కనుపెట్టి శుద్ధోదనుఁడు తన పుత్త్రుఁడు ప్రజాపాలన మార్గము విడిచి వేదాంత మార్గమునఁ బోవు చున్నాఁడని భయపడెను. కనుక నతనికి శీఘ్రముగ వివాహము చేయుటకు నిశ్చయించెను. సిద్ధార్థుఁ డందుల కంగీకరించి తమ పొరుగు రాజ్యము నేలుచుండెడి సుప్రబుద్ధుఁడనెడి రాజు నొద్దకుఁ బోయెను. ఆ రాజు చెప్పినచొప్పున మహాధనుస్సు నొకటి వంచెను. మహాఖడ్గము నొక దానిని జళిపించెను. దుష్టాశ్వమొక దానిని లోఁగఁదీసెను. ఇట్లుచేసి యతనిని మెప్పించి యశోధరయను నతని కొమార్తను వివాహమాడెను. అప్పటి కతనికిఁ బదునాఱు సంవత్సరముల వయస్సుమాత్రమే.

తన పుత్త్రుని కొఱకు దానింతకు ముందు కట్టించిన ప్రాసాదత్రయము కాకుండ నూత్న దంపతుల కొఱకు శుద్ధో

దనుఁడు మఱియొక ప్రాసాదము కట్టించెను. నగరులోనికి బిచ్చ. గాండ్రుగాని, రోగగ్రస్తులుగాని, ముక్కాలి ముదుసలులుగాని పోకుండునటులు సింహద్వారము నొద్ద విశ్వసనీయులగు భటులను గావలి యుంచెను. ఆ కేళికాసౌధమందు సిద్ధార్థుఁడు యశోధరతోఁ గొన్ని సంవత్సరములు సంసారసుఖము లనుభ వించెను. ఒకనాఁడతనికి వాహ్యాళికిఁ బోవుటకుఁ గుతూహలము కలిగెను. రథము బంపుమని యతఁడు తన తండ్రిగారియొద్దకు నంతఃపుర పరిచారిక నొకర్తుకను బంపెను. అపుడు తన నగర మంతయు సిద్ధార్థున కానందదాయకముగఁ దోఁపవలయునని శుద్ధోదనునకు గోర్కెగలిగెను. అందువలనఁ దన ప్రజలు తమ గృహముల నన్నిఁటిని జక్కగ నలంకరింపవలెననియు, నానాఁ డందఱును జక్కని వస్త్రాభరణములు ధరించి సిద్ధార్థుని కెదురేఁగ వలెననియు నతఁడు త్తరువు చేసెను. జరావృద్ధులు గాని, రోగపీడితులుగాని, చెవిటి, మూఁగ, గ్రుడ్డి మున్నగు వారుగాని, భిక్షుకులుగాని రాజమార్గములందుండరాదని కూడ నతఁ డాజ్ఞాపించెను.

## శ్రీ గౌతమ చంద్రుఁడు చూచిన చతుర్విధమగు దృశ్యము.

సుందరములైన యశ్వములనుబూన్చి చెన్న డనెడి రథ చోదకుఁడు సిద్ధార్థుని ప్రాసాదమునకు రథముఁ దోలుకొని వచ్చెను. భగవత్సంకల్పము ననుసరించి దేవతలు తమలో నొకరిని బిలిపించి పురివీధులలో సిద్ధార్థుఁడు విహరించు చున్నప్పుడు నాలుగు రూపములతో నతనికి దర్శన మీయ వలయునని చెప్పిరి. అందు మొదటి రూపము నడుము వంగిన ముక్కాలి ముదుసలి రూపము. రెండవది రోగగ్రస్తునిరూపము.

మూఁడవది శవరూపము. నాలుగవది మహనీయుఁడగు నొక సన్న్యాసి రూపము.

సిద్ధార్థుఁడు రథమెక్కి రాచబాటలవెంటఁబోవుచుండగా పురజను లందఱును నవ్వు మొగములతో నతని కెదురేఁగి స్వాగతమిచ్చిరి. వారి నభినందించుచు నతఁడు పురమునంతటిని గలయఁ జూచెను. అప్పుడొక వీధిలో నొక ముసలి భిక్షుకుఁ డతనికంటఁబడెను. అతఁడు చినుఁగు ప్రాఁతలు ధరించియుండెను. అతనికి గన్నులు లోఁతుసకుఁ బోయినవి· అతని శరీరమందు రక్తమాంసము లుండియు లేనట్లుండెను. అతఁడు నడుమువంగిన యొక యెమ్ముకల ప్రోఁగనియే చెప్పవచ్చును. వానినిఁ జూచి సిద్ధార్థుఁడు తన రథమును నిలిపెను. ఆ ముదుసలి కఱ్ఱ యూఁత జేసికొని నడచివచ్చి యతనిని దిరిపము వేఁడెను. అతఁ డతనిని జూచి మిక్కిలి జాలిపడి కొన్ని నాణెము లతనిచేతిలోనైచెను. అతఁడు చనినవెనుక సిద్ధార్థుఁడు తన రథచోదకునితో నిట్లనెను. "చెన్నా ! వీఁడు మనలను బోలిన మానవుఁడే కదా ? ఎందు కిట్లు నడుమువంగి తిండికి లేక కష్టపడుచున్నాఁడు ? మానవు లలోఁ గొందఱీ విధముగ జన్మింతురా ?" అనిన విని చెన్నఁ డిట్లు బదులు చెప్పెను. "ప్రభూ ! ఇతఁ డొక ముసలివాఁడు. జరాభారముచే నిట్లయినాఁడు. వాని దీపములోని చము రంతయు వ్యయమైనది. వత్తి కాలిపోయినది. ఇఁక నే క్షణ మందునో యది యాఁటిపోవును." అది విని యతఁడు, "చెన్నా! వీఁడొక్కఁడే యిట్లయినాఁడా ? లేక మనముకూడ నిట్లే యగుదుమా ?" అని ప్రశ్నింపఁగా "స్వామీ ! మన మందఱము నిట్లే యగుదుము. నీవు, నీ జనకుఁడు, నీప్రాణేశ్వరి

కూడ వీనివలె జరాభారము ననుభవింప వలసినదే. ఆఁడు బెబ్బులివలె జర మనలనందఱను దన యొద్దకు రమ్మని సదా తర్జింపుచునే యుండును సుమా."

చెన్నఁ డిట్లు చెప్పగా విని దుఃఖ భారముతో మఱల సిద్ధార్థుఁడు రాచనగరు జేఱుకొనెను. మఱియొక దినము చెన్నఁడు సిద్ధార్థుని రథము నెక్కించుకొని యొక పురవీధిలోఁ బోవుచుండగా "నాయనాలారా! నాకు నిలుచుటకు శక్తి లేదు. నన్ను నిలువఁ బెట్టుఁడు. నా యింటికిఁ జేర్పుఁడు". అనెడియార్త ధ్వని వారికి వినఁబడెను. రథము వాని చెంగటకుఁ బోనిచ్చి సిద్ధార్థుఁడు రథము దిగి యా దుర్బలశరీరుని దన రెండు చేతులతో నెత్తుచుండెను. చెన్నఁడది చూచి, ''యువరాజా! వీఁడు రోగగ్రస్తుఁడు. మీఁదు మిక్కిలి పీసిది యంటురోగము. వీనిని దాఁక వలదు''. అని యతనిని వారించెను. రోగమును, మరణమును దప్పించుకొనఁ గలవాఁడు సృష్టిలో లేఁడని కూడ జెప్పెను. అది విని సిద్ధార్థుఁడు తన నగరికి మఱలివచ్చి ప్రపంచమందంతటను నిండియున్న యింత దుఃఖమునకుఁ గారణమేమై యుండు నని తొల్లిఁటివలెనే యాలోచింపుచుఁ గొంతకాలము గడపెను.

మఱియొక దినము చెన్నఁడును, సిద్ధార్థుఁడును రథము నెక్కి నగర వీధులవెంటఁ బోవుచుండగా నగర పరిసరమున నొక శవమును, దానిపైఁ బేర్చిన కట్టెలగుంపును, అవి మండు చుండగా దానిచుట్టుచేరి యేడ్చుచున్న కొందఱు మనుష్యులను సిద్ధార్థుఁడు చూచెను. ఇది యేమియని చెన్నని నడుఁగగా నతఁడు "ప్రభూ! ఇది యొక మానవ కళేబరము. ప్రాణము పోయిన మనుష్యుల నిట్లే కాల్చివేయుదురు. ఏడ్చుచున్నవారు

వీనికి బంధుగులు. మరణ మనివార్యమైనది. ఏనాఁడో యొక నాఁడు మనకందఱకు గూడ నిట్టిగతియే పట్టును" అని చెప్పెను. అది విని విషాదముతో నతఁడు నగరికి దిరిగి వచ్చెను.

మఱియొకనాఁడు సిద్ధార్థుఁడు రథమెక్కి చెన్నునితో రాజమార్గముల వెంబడి పోవుచుండెను. అప్పుడు నిరామయుఁడును, ముండిత శిరస్కుఁడును, పీతవస్త్రధారియునై చేతుల యందు దండకమండలములను ధరించిన యొక వ్యక్తి యతని కంటఁబడెను. ఇట్టి మహనీయు నెన్నఁడు నింతకుముందు యువరాజుచూచి యుండలేదు. వానిని జూచి యితఁడెవఁడని చెన్నని నడిగెను. అది విని "ప్రభూ! సర్వసంగ పరిత్యాగము చేసిన యితఁడొక భిక్షువు. ఇతఁడు సత్యాన్వేషణము చేయుచు మధుకరవృత్తిని జీవించుచున్నాఁడు. ప్రపంచభోగములకు రోసి ప్రపంచదుఃఖములను గమనించి దుఃఖమయమగు సంసారము నితఁడు పరిత్యజించెను. ఇపుడితఁ డేకాంత జీవనము చేయుచున్నాఁడు. వినుము ప్రభూ! భోగమునకు రోగభయము కలుగుచున్నది. కులమునకుఁ బతనభయము కలుగుచున్నది. విత్తమునకు రాజులు హరింతురనెడి భయము కలుఁగుచున్నది. మఱియు శౌర్యమునకు దైన్యభయమును, బలమునకు శత్రుభయమును, రూపమునకు జరాభయమును, శాస్త్రమునకు వాదభయమును, సద్గుణముల కపనిందాభయమును, శరీరమునకు మృత్యుభయమును కలుఁగుచున్నవి. కనుక సంసారమందలి ప్రతి విషయమును భయాన్వితముగనే యున్నది. వైరాగ్య మొక్కటే భయరహితమైనది సుమా" అని యతఁడు బదులు చెప్పెను.

## శ్రీ గౌతమ చంద్రునికిఁ బుత్త్రోదయము.

అది విని సిద్ధార్థుఁడు తానుకూడ విరాగియు, కాషాయాంబర ధారియునై భిక్షుకవృత్తి నవలంబించి సత్యాన్వేషణము చేయుట మేలనుకొనియెను. రథముదిగిన వెంటనే యతఁడు తన తండ్రిగారియొద్దకుఁ బోయి తన మనోభీష్టము దెలిపెను. దైవజ్ఞులు చెప్పిన జోస్యమును, దేవతలయు, ఋషులయు వాక్యములును తన పుత్త్రుని విషయమై ఫలించుచున్నవని యతఁడు తెలిసికొనెను. తన రాజ్యమిఁక నేమగునో యని మనమున దిగులు చెంది విధి యనుల్లంఘనీయ మగుటచే కుమారునితో "పుత్రా! నీ యర్థాంగలక్ష్మి యగు యశోధర యిప్పుడు నిండు చూలాలై యున్నది కదా! ఆమె ప్రసవించిన వెనుక నీ యిష్టము వచ్చినట్లు చేయవచ్చు" ననెను. సిద్ధార్థుఁ డందులకు సమ్మతించెను.

అప్పు డతనికి యిరువది తొమ్మిదవ సంవత్సరము వయస్సు. ఒక నాఁటి యుదయము సిద్ధార్థుఁడు రోహిణీనదిలో స్నానముచేసి వచ్చుచుండెను. అపుడు నగర ద్వారమున శుద్ధోదనుఁ డతని కెదురేగి తనకు బుత్త్రోదయ మయ్యెనని చెప్పెను. కాని యతఁ డపుడు సర్వసంగ పరిత్యాగమునే సంకల్పించి యున్నందున తనకుఁ బుత్త్రుఁడు కలుగుట తన సత్యాన్వేషణమున కవరోధముగ నెంచెను. కనుక నా వార్తవిని యతఁడు సంతోషించలేదు. మీఁదు మిక్కిలి తన కొమరునికి రాహులుఁడని నామకరణము చేయుమని తన తండ్రిని గోరెను. రాహుల శబ్దమున కవరోధమని యర్థమఁట.

తదుపరి కొలఁది కాలము మాత్రము సిద్ధార్థుఁడు రాచనగరునఁ దన భార్యాపుత్రులతో గడపెను. ఒకనాఁటి రాత్రి యశోధర తటాలున నిద్రలేచి తన భర్తనుగూడ నిద్ర నుండి లేపి "ప్రాణేశ్వరా! నా కిప్పుడు మూఁడు కలలు వచ్చి నవి. వినుము చెప్పెదను. తన శిరస్సున నమూల్య రత్నమొకటి వెలుఁగుచుండ శ్వేత వర్ణముగల మహా వృషభ మొకటి మన నగరి వీథులలోఁ దిరుగుచుండెను. 'యశోధరా! నీవు దాని నెట్ులైన నిరోధింపవలెను. అది నగరము దాఁటిపోయినచో నగరికే ముప్పువచ్చును సుమా' అనెడి యొక యశరీరవాక్యము నాకు వినఁబడెను. కాని నేనెంత ప్రయత్నించినను నన్నది తప్పించుకొని పోయి పురద్వారపాలకులను గూడ పొడిచి పాఱి పోయెను. రెండవ స్వప్న మేమనఁగా మన పట్టణమందలి యింద్రుని దేవళమున నలుగురు దివ్యపురుషులు ప్రవేశించిరి. అపుడా దేవాలయముపై నెగురుచున్న యింద్ర నికేతనము నేలఁగూలెను. అచ్చోట మఱియొక దివ్యతర నికేతనము నాకు గంటఁబడినది. పిమ్మట గలిగిన మూఁడవ స్వప్నమే నాకు వెఱఁగు గొల్పినది. యువరాజు శయ్యమీఁద గనఁబడలేదు. అచట తమ వస్త్రాభరణములు మాత్రమే నాకుఁ గనఁబడెను. కల వచ్చి నపుడెల్ల 'అనుకొన్న కాల మాసన్న మయ్యెను.' అనెడి యశరీరి పలుకులు నాకు వినవచ్చినవి." అని భర్తతో జెప్పెను. అదివిని సిద్ధార్థుఁడు తన సతీమణి ననునయ వాక్యములతో నోదార్చి మఱలఁ బరుండఁ జేసెను. యశోధర మఱల నిదురించి "సమయ మాసన్న మాయెను; సమయ మాసన్నమాయెను" అనుచు మాటి మాటికిఁ బలవరించు చుండెను.

## శ్రీ గౌతమ చంద్రుని గృహత్యాగము.

అప్పటికి నిశీథమయ్యెను. సిద్ధార్థుఁడు సడిచప్పుడు లేకుండ శయ్యదిగి తనలో నిట్లనుకొనెను:— "యశోధర చెప్పినట్లు సమయ మాసన్నమైనది. సమస్తమును విడిచి నే నిదే వెడలిపోవుచున్నాను." ఇట్లనుచు బిడ్డముఖమును, ప్రేయసి ముఖమును కడసారి యొకసారి చూచెను. అప్పుడు ప్రేయసి నుద్దేశించి, "నిదురించుచున్న యోసుందరీ! నీకును నాకును దీఱని యెడబాటు గలిగించెడి దైనను విశ్వమునంతను నుద్ధరింపఁ గలిగినంతటి త్యాగము నన్నుఁ జేయుమనుచుఁ గోమలములగు నీ పెదవులు నన్నందుల కాహ్వానింపుచున్నవి సుమా" అని యెను. మఱికొంత తడవాఁగి యామెమోము మఱలఁబరికించి యామె నుద్దేశించి, "ప్రాణేశ్వరి! నా హృదయమందలి రహస్య విషయమును నీ హృదయమందుఁ జేర్చుచున్నాను వినుము. నేను విశ్వమందలి సమస్తజీవులను మిక్కిలిగఁ ప్రేమించుటచేతనే నిన్నుఁగూడ నే నత్యధికముగఁ బ్రేమించుచున్నాఁడను సుమా" అని చెప్పెను. సిద్ధార్థుఁడు వెంటనే శయ్యాగృహమును, ప్రాసాదమును విడిచి యశ్వశాలకుఁ బోయెను. అచట నిదురించుచున్న చెన్నని లేపి తాను రాజ్యము విడిచి పోవుటకు తన కొఱకు తత్క్షణమే రథమాయత్త పఱపుమని యతనినిఁ గోరెను. అది విని చెన్నఁడు, "యువరాజా! నీ తండ్రిని, భార్యను దుఃఖసముద్రములో ముంచి నీవు పోవుచుంటివి కదా? ఇదివారియందు నీకుఁగల ప్రేమలక్షణమందువా? వారిని నీవు విడిచి పోయినతఱువాత నీవు వారి నుద్ధరించెడి దేమున్నది?" అని యడిగెను.

అప్పుడు సిద్ధార్థుఁడు "మిత్రమా ! స్వార్థము సాధించుట కెట్టి ప్రేమ చూపఁబడుచున్నదో యది నిజముగఁ బ్రేమయే కాదు. నేను వారిని స్వార్థబుద్ధితోఁ బ్రేమింపలేదు. నా విశ్వప్రేమకే వారుపాత్రులై యున్నారు. నా విశ్వప్రేమ చేతనే వారికి నాయందుఁగల ప్రేమయందలి స్వార్థరూపమైన మలినమును వదలించి వారిని నిర్మల ప్రేమ మయులుగఁజేసి వారి నుద్ధరించుట కొఱకే నేను విశ్వప్రేమను బ్రకటించుటకుఁ బోవుచున్నాను. అది ప్రకటింపఁబడని యెడల మానవులకు స్వార్థపరత్వము వదలదు. విశ్వప్రేమ పరిచయము కలుగదు. ఈ విధముగగాని ప్రజలు తరింపనేరరు. నాతండ్రికిని, భార్యకును గలిగెడి మనస్తాపమునకుఁ గారణము తమకు సంసారసుఖము కలిగించుచున్న వ్యక్తి తమ్ము విడిచిపోవుచున్నాఁడని యెడి స్వార్థ చింతయే సుమా. శస్త్రచికిత్సచేత దుష్టాంగము ఖండింపఁబడినపుడు శరీరమున నారోగ్యము కలుగును కదా ? అటులే నా సంసారత్యాగమనెడి శస్త్రముచేతనే విశ్వప్రేమయందుఁ గలుగు భాగముగఁ జేటియున్న నా యాప్తవర్గము యొక్క స్వార్థపరత్వబుద్ధి ఖండింపఁబడును. అపుడు వారికి నిర్మలప్రేమ సిద్ధించును. కనుక నా త్యాగము వారికిఁ గళ్యాణకారణమే యగుచున్నది" అని యతనికి బదులు చెప్పెను.

అప్పుడు చెన్నఁడు "ప్రభూ ! నీ విప్పుడీ రాజ్యము విడిచి పోవుచున్నావు కదా ? ఇటుపైని నీ వేరాజ్యమునఁ బ్రవేశింపఁ దలఁచితివి ?" అని యడుగగా సిద్ధార్థుఁడు, "నేనిపుడు ప్రవేశింపనున్నది ప్రేమరాజ్యము. ఏమన, నా యథార్థమగు రాజ్యము ప్రేమరాజ్యమే. కనుకనే భౌతికమైన యీ కామ

రాజ్యమును నేను కోరక ప్రేమరాజ్యమునే కోరుచున్నాఁడను. దానినిఁ గోరుట కింకొక కారణముకూడఁ గలదు. ప్రపంచ దుఃఖములచేతఁ బరితపించుచున్న మానవుల హృదయములతో నా హృదయము సానుభూతిఁ జూపుచుఁ బరితపించుచున్నది. కనుక నావారలగు వీరును, అనఁగా తండ్రి, భార్య మొదలైన వారును, ఇటుపైని నావారు కాఁబోవువారును, — వారు వీరననేల? కోట్లకొలఁదిగా నున్న విశ్వమందలి సకల మానవులును, ఈ నా త్యాగ యజ్ఞము చేతనే యుద్ధరింపఁబడగలరు." అని యతనికిఁ బ్రత్యుత్తర మిచ్చెను.

## శ్రీ గౌతమ చంద్రుని రాజ్యత్యాగము.

సిద్ధార్థుఁడు చెప్పినదంతయు విని ధన్యాత్ముఁడైన చెన్నఁడు మిగుల సంతోషించెను. అతఁడు సిద్ధార్థుని రథముపై నెక్కించికొని రాచనగరు ద్వారము నొద్దకు వచ్చెను. అచ్చటఁ గావలియున్న రాజభటులకు దేవతలప్పుడు గాఢనిద్ర గల్పించిరి. అందు వలన వారికి రథాశ్వముల కాలిచప్పుడు వినఁబడలేదు. మూయఁబడిన సింహద్వారముకూడ దేవతా మహత్త్వముచేతఁ దనంతట తానే తెఱచుకొని రథము బయటికి బోవుటకుఁ దెరువిచ్చెను.

తెలతెలవాఱుచుండ సిద్ధార్థుని రథము కపిలవాస్తు పురమున కత్యంత దూరమందున్న అనోమానది యొద్దునకు వచ్చెను. అచట సిద్ధార్థుఁడు రథము దిగెను. వెంటనే తన సుందరములైన కేశములు ఖడ్గముతో ఖండించి సన్న్యాసి వేషము ధరించెను. తన యొంటనున్న వస్త్రాభరణములను దీసి చెన్నని కిచ్చి యవి మహారాజున కర్పింపుమని కోరెను. సిద్ధార్థుఁ

డప్పుడు తన పేరు గౌతమునిగ మార్చుకొని బింబిసారుఁడను మహారాజు పరిపాలించుచున్న మగధరాజ్యమునకు ముఖ్య పట్టణమైన రాజగృహామునకుఁ గాలి నడకతోఁ బోయెను. అచ్చటి ప్రజలతనినిః జూచి యొక మహా పురుషుఁడు నగరము లోనికి వచ్చినాఁడని మహారాజునకు విన్నవించిరి. బింబిసారుఁ డప్పుడు సపరివారుఁడై పోయి గౌతమునికి స్వాగతమిచ్చి "మహానీయా! మీ రెవరు? మా నగరమున కేల వచ్చినారు?" అని యతని నడిగెను. గౌతముఁ డపుడు తాను శుద్ధోదనమహా రాజ పుత్రుఁడ నని చెప్పెను. సకల మానవ దుఃఖకారణ మరయుటకును, కామము, మోహాము, శోకములేని మహా ప్రశాంతి స్థితిని సంపాదించుటకును దాను రాజ్యత్యాగము చేసి విరాగియై పరివ్రాజక వృత్తి నవలంబించితినని బింబిసారునకుఁ జెప్పెను. తన రాజ్యమునందుఁ గొంతకాలముండు మని బింబి సారుఁ డతనినిఁ బ్రార్థించెను. దాని నంగీకరింపక గౌతముఁడు మహారాజును వీడ్కొని యురువేళ నంటియున్న యరణ్యము నకుఁ బోయెను. ఉరువేళ యనునది యిప్పటి బుద్ధగయ యం దలి మహాబోధి దేవాలయమున కనతి దూరమందుండెడి యొక చిన్న గ్రామము. ఈయరణ్యమందు నివసించెడి కొందఱు తపస్వుల యొద్దకుఁబోయి సత్యాన్వేషణ మెట్లు చేయవలెనని గౌతముఁ డడిగెను. కృచ్ఛ చాంద్రాయణాది వ్రతములు, శుష్కోప వాసములు, నందులకు సాధనములనుచు నతని కుప దేశించిరి. వారు చెప్పినట్లతఁడు కొంతకాలము సాధన చేసెను గాని సఫలమనోరథుఁడు కాఁడయ్యెను. ఇట్లుకాదని యతఁడా యరణ్యమధ్యమునకుఁ బోయి యచట సుఖోపవిష్టుఁడై యింద్రి యముల నరికట్టి జీవిత సమస్యా చింతనమందు తన మనస్సు

నహార్నిశమును బ్రవేశపెట్టెను. ఇటులాఱుసంవత్సరము లన్న పానాదులు విడిచి సాధనచేసెను. అందువలన నానాఁటి కతఁడు కృశించి ప్రాణశక్తి పూర్తిగా తగ్గిపోవుటచే నొకనాఁడతఁడు స్మృతి తప్ప నేలకొఱగెను. కాని భగవదనుగ్రహముచే నతనికి మఱల స్మృతి గలుగుటయు నతఁడు తనలో దానిట్లు వితర్కించెను:—"ఇంద్రియ శోషణముచేతను, ఉపవాసములు చేసి శరీరమును గృశింపఁజేయుటచేతను జీవిత ప్రయోజనమును సాధింపఁ గలనని నే నహంకార వశుఁడనై యనుకొంటిని. కాని యిది మార్గము కాదనియు, నుపవాసములు చేసినంతమాత్రాన జ్ఞానసిద్ధి లాభము కలుగదనియు నేనిపుడు తెలిసికొంటిని. సర్వార్పణ బుద్ధితో భగవదనుగ్రహము నర్థించుచు నతని జ్ఞాన జ్యోతి నాలో ప్రవేశించునట్లు నా హృదయమును దెఱచి యుంతును గాక! నేఁక భుజింతును గాక !"

## శ్రీ గౌతమ చంద్రుఁడు పాయసాన్నము భుజించుట.

అతఁ డిట్లనుకొనుచుఁబోయి చేరువనున్న యొక న్యగ్రోధ వృక్షముక్రింద గూర్చుండెను. అపుడచటి కనతి దూరమందున్న సేనాని యనెడి గ్రామమునందలి యొక ధనికుని కొమార్తయగు సుజాతయను నామె యొకపాత్రతో పాయసాన్నము తెచ్చి యతని యెదుట నుంచెను. ఆమెకుఁ జాల కాలము వఱకు సంతానము లేకుండుటచేఁ దనకొక పుత్త్రుఁడు కలిగినచో విష్ణుదేవునికి పాయసాన్నమర్పింతునని యామె మ్రొక్కుకొనెను. భగవదనుగ్రహముచే నామెకు పుత్త్రుఁడు జన్మించెను. ఆ వృక్షరాజము క్రింద కూర్చుండిన గౌతముని నామె పరిచారిక యొకర్తుక చూచి, "అమ్మా! సాక్షాత్తు

మహావిష్ణువే యామఱ్ఱిచెట్టు నీడను కూర్చుండి యున్నాఁడు" అని చెప్పెను. ఆమె వెంటనే క్షీరాన్నమువండి తన కొమరునిఁ జంకనె త్తికొని పాయసపాత్రతో గౌతముని కడకు వచ్చెను. అతఁడు లేచి పాయసాన్నమును తన భిక్షాపాత్రయందు గ్రహించి చేరువనున్న నిరంజనా నదికిఁబోయి స్నానముచేసి వచ్చి భోజనముచేసెను. పిదప సుజాతను, ఆమె పుత్త్రుని నాశీర్వదించి యామెతో, " సుజాతా! నీ విట్లు నన్ను పూజించితివి గనుక నేను కూడ నిన్ను పూజించుచున్నాను. నా యాశీర్వచన ఫలితముగ పుత్త్రలాభరూపమగు నీ మనోభీష్టము నీ వెట్లుసాధించితివో సత్యవస్తుప్రాప్తిరూపమగు నా మనోభీష్టముకూడ నేను సాధింపఁ గలుగునట్లు నీవు నన్నాశీర్వదింపవలెను" అనెను. ఆ మాటలు విని సుజాత గౌరవ సంభ్రమములతో నట్లేయగుగాత మని మధురముగఁ బలికి తన యింటికి మఱలిపోయెను.

## శ్రీ గౌతమ చంద్రుఁడు జ్ఞానోదయము నొందుట.

భగవత్సంకల్పమే శరణ్యమనుచు గౌతముఁడు కృతనిశ్చయుఁడై యా సాయంకాలమే యచటికిఁ జేరువనున్న యశ్వత్థ వృక్ష మొక దానిని సమీపించెను. దాని క్రింద గూర్చుండి యతఁడు మనస్సు నంతను భగవంతునియందుఁ జేర్చి కొన్ని దినములు కదలక మెదలక యట్లే యుండెను. సంకల్ప మాత్రముచేత ముల్లోకములను వ్యాకులపెట్టఁగల శక్తిమంతుఁడగు మారుఁడు కామము, క్రోధము, లోభము, మోహము, గర్వము, ఓర్వలేమి, విషాదము. భయము మున్నగు తన పరివారమునంతను దోడ్కొని యచటికి వచ్చి గౌతముని

నప్పుడు ముట్టడించెను. దుష్టసంకల్ప రూపములగు నా పెను భూతములు గౌతముని(జేరి యతని నింటికి మరలు మనియు, రాజ్యము నేలుకొమ్మనియు, భార్యాపుత్రులను గూడి మఱల సంసారసుఖముల ననుభవింపుమనియు నయమున, భయమున నతనికి బోధింపసాగెను. కాని గౌతముండు వానికి లొంగ లేదు. పదునెనిమిది దినములు వానితో హోరాహోరిగా బోరాడి తుదకు వానిని జయించెను. అప్పుడు మారుండు విఫల మనో రథుండై తన పరివారమును దోడ్కొని యతనిని విడిచిపోయెను. అప్పుడతని యంతఃకరణము పూర్తిగ నిర్మల మగుటచేత భగవజ్జ్యోతి యతని నిర్మలహృదయమున బందొమ్మిదివ దినమునఁ దెల్లవాఱుజామునఁ ప్రవేశించెను. అప్పుడతని మనఃకమలము పూర్తిగ వికసించెను. అపారమైన తెలివి వెలుఁగతని యందుఁ బ్రవేశించుటచే నాల్గు విధములగు సత్యములతనికి స్ఫురించెను. జనన మరణముల ననంతముగఁ బెంచునట్టివి ప్రపంచదుఃఖము లను నది మొదటి సత్యము. ఎంత దీర్చినను దీఱక నేయిపోసిన యగ్నివలె సదా ప్రజ్వరిల్లుచు నిత్యనూతన రూపము వహించెడి స్వార్థపరత్వమే మానవదుఃఖ కారణమనునది రెండవ సత్యము. స్వార్థపరత్వ రూప కామనాశన మవశ్య కర్తవ్య మనునది మూండవ సత్యము. అది నశించుటకు సాధనమవశ్యము చేయ వలయుననునది నాలుగవ సత్యము.

జ్ఞానజ్యోతి ప్రవేశించుటచే నతని హృదయము వెలుఁగు చుండెను. అందువలన ప్రపంచము నందలి సకల భూతములును జ్యోతిర్మయములుగ నతనికిఁ గనఁబడఁ జొచ్చెను. సూర్యోదయ మైనంతనే చీఁకటులు తొలఁగి వృక్షములు, పొలములు,

పర్వతములు, సరిత్సముద్రములు, మనుష్యులు, నితర జంతు జాలము మున్నగు సమస్త ప్రపంచ వస్తువులును సుస్పష్టముగ మన కక్షిగోచరములైనట్లు గౌతమునికి జ్ఞానోదయమైనంతనే మానవదుఃఖ కారణములును, తన్నివారణోపాయములును నతనికి సుస్పష్టములయ్యెను. ఈ విధముగ గౌతముఁడు తన ముప్పది యైదవయేట వైశాఖశుద్ధ పూర్ణిమ దినమున జ్ఞాన ప్రబుద్ధుఁడయ్యెను. అందువలన నతఁడంతటి నుండియు బుద్ధ నామముతో వెలయుచుండెను. అతఁడు కూర్చుండిన యశ్వత్థ వృక్షముకూడ జ్ఞానవృక్షముగఁ బరిగణింపఁబడఁ జొచ్చెను. ఆ వృక్షముక్రింద బుద్ధుఁడు నలువది తొమ్మిది దినములు నివసించెను.

## శ్రీ గౌతమచంద్రుని జ్ఞానబోధలు.

పదపడి గౌతమ బుద్ధుఁ డరణ్యావాసము విడిచి సంసార దుఃఖములచేఁ బరితపించుచున్న సర్వ మానవకోటికిని తన సత్య సందేశ ముపదేశించుటకు బయలుదేఱెను. అతఁ డెల్లరకు నిట్లు బోధింపఁజొచ్చెను. "సోదరులారా! అనుభవముచే నేను దెలిసికొనిన సత్యవృత్తాంతము వినుఁడు. భగవంతుడు సృష్టినంతను ధర్మసమ్మతముగ నిర్మించి దాని నేక సూత్రమున నడిపించుచున్నాఁడు. సృష్టియం దెచ్చటను గారణములేని కార్య ముండదు. మంచి సంకల్పములచేత మంచి ఫలములు కలుగుచున్నవి. మానవుఁడు తానుజేసిన మంచి కర్మలకును, జెడ్డ కర్మలకును ఫలముగఁ బుణ్యాపాపము లనుభవించుచున్నాఁడు. ఈ జన్మలో మానవుఁ డనుభవించెడి యావేదనము, విచారము, దైన్యము. శోకము మున్నగునవి యతని పూర్వజన్మ దుష్కృత ఫలములు.

వాని ననుభవించుటకే మానవునికి జన్మాంతరము కలుగుచున్నది. సకల పాపకర్మలకును గామమే మూలకారణము. కామమును విడిచినగాని మానవ దుఃఖములు నశింపవు. సృష్టియంతయు నిత్యము మాఱుచుండెడి పదార్థములతో నిండి దుఃఖజనకమే యగుచున్నది. కనుక నిత్యశాంతిరూపమగు నిర్వాణప్రాప్తియే జీవితప్రయోజనము. కర్మసిద్ధాంతమునందలి విశ్వాసము, భావసంశుద్ధి, సత్యకథనము, సత్కర్మము, ధర్మజీవనము, సాధువర్తనము, ఆత్మశిక్షణము, ధ్యాననిష్ఠ యనెడి యష్టాంగములు గల దివ్యపథమునఁ జరింపుటచే మానవుఁడు సంసారదుఃఖ రహితుఁడై నిర్వాణరూపముక్తి నొందును. జీవహింస, చౌర్యము, వ్యభిచారము, అసత్యము, మాదకవస్తుసేవనము పూర్తిగ విసర్జింపవలెను. అకాలభోజనము, నృత్యగీతములు, నీతిబాహ్యములగు ప్రదర్శనములు, పుష్పమాలాధారణము, నేపథ్యవిధానము, హంసతూలికా తల్పములు సత్యసాధకునికి విషప్రాయములు.”

ఇటు లద్భుత విధముగ బోధింపుచు మొట్ట మొదట నతఁడు కాశికిఁబోయి యచటఁ దన నూతన ధర్మప్రచారము చేయఁగా నతనికిఁ గొందఱు శిష్యులు లభించిరి. కాశీ పట్టణ సమీపమందున్న యొక వనమున నతఁడు శిష్యబృందముతోఁ గొన్నాళ్ళుండెను. అపుడు తన్నుఁ జూడవచ్చెడి ప్రజలకు జ్ఞానబోధ సేయుటచేఁ దన బోధలు వినిన వారా క్షణమందే యతనికి శిష్యులగుచు వచ్చిరి.

కొంతకాలమైన తరువాత బుద్ధుఁడు తన శిష్యబృందముతో రాజగృహమునకుఁ బోయి యూరివెలుపల నున్న

నొక తాళవనమునందు బసచేసెను. అప్పుడు మగధ రాజ్యాధీశుఁడగు బింబిసారుఁడు సపరివారుఁడై యచటి కేతెంచి బుద్ధునికి సాష్టాంగ ప్రణామము చేసెను. బుద్ధుఁ డతని నాశీర్వదించి తాను సాధించిన నూత్నధర్మముల నతనికి బోధించెను. అతని బోధలువిని తన్మయత్వమునొంది బింబిసారుఁడు తత్క్షణమే యతనికి శిష్యుఁ డయ్యెను. "యథారాజా తథాప్రజా" యనునట్టి యార్యోక్తి ననుసరించి యతని ప్రజలుకూడ రానురాను బౌద్ధ ధర్మములనే యవలంబించిరి.

గౌతమ బుద్ధుఁడు రాజగృహ మందుండిన వార్త కొన్నాళ్ళ కతని తండ్రి శుద్ధోదనునకుఁ దెలిసెను. శుద్ధోదనుఁడును, యశోధరయును, రాహులుఁడును గౌతముని నెపుడు చూతుమాయని తహతహ పడఁ జొచ్చిరి. అతనినిఁ దోడ్తెచ్చుటకు శుద్ధోదనుఁ డెందఱినో రాయబారులను రాజగృహమునకుఁ బంపెను. కాని వెళ్ళిన రాయబారి మరల కపిలవాస్తుపురమునకు రాఁడయ్యెను. ఏమనిన, వారు గౌతముని బోధలు విని నంతనే యతనికి శిష్యులై యతనిని క్షణమైన విడిచి యుండుట కిచ్చగింపరైరి. గౌతమ బుద్ధుని రాకకొఱకు రాజకుటుంబమంతయు నువ్విళ్లూరు చుండుటచే శుద్ధోదనుని సభాస్తారులలో ప్రముఖుఁడును, సిద్ధార్థుని బాల్య స్నేహితుఁడును నయిన ఉదయనుఁ డనువాఁడు పోయి గౌతమ బుద్ధుని దర్శించి యతనిని శిష్య సమేతముగ కపిలవాస్తు నగరమునకుఁ దోడ్తెచ్చెను. గౌతముఁడు రాజ్యత్యాగము చేసి యప్పటికి కేడేండ్లయ్యెను.

## గౌతమచంద్రుఁడు తండ్రిని, భార్యను చూడ వచ్చుట.

గౌతముఁడు నగరమునఁ బ్రవేశించిన వెంటనే యతని భార్య యశోధర ముందుగఁ బోయి యతనికి సాష్టాంగదండ ప్రణామ మాచరించెను. పిదప శుద్ధోదనుఁడుకూడ సంతోష ముతో నతనికి స్వాగతమిచ్చి రాజ్య మప్పగింతునని యతనితోఁ జెప్పెను. అదివిని గౌతమ బుద్ధుఁడు తండ్రితో, "రాజా! వినుము. యువరాజగు సిద్ధార్థుఁ డనెడి ప్రత్యేకవ్యక్తి యిపుడు లభింపఁడు. అతడిపుడు బుద్ధుఁడై సార్వ జనీనత నొందినాఁడు. అతని యందిపుడు సర్వమానవులకు సమానమగు స్వామ్యము కలదు. నీకు కూడ నట్టి హక్కే కలదు. అతఁ డందఱకును సమానబంధువును, ప్రియతముఁడునై యున్నాఁడు. అంతవంత మును, భౌతికమును నగు కామరాజ్యము నేనాఁడో విడిచి యతఁడిపు డనంతమగు ప్రేమ రాజ్యమునకుఁ జక్రవర్తియై యున్నాఁడు." అని మృదుమధుర భాషలతో నతనికి సమా ధానము చెప్పెను. తదుపరి యొకనాఁటి రాత్రి బుద్ధుని నూత్న ధర్మములు శుద్ధోదనుఁడు వినెను. అపుడానంద పారవశ్యముతో నతఁడు గౌతమ బుద్ధునకు సాఁగిలి మ్రొక్కి తనను శిష్యాధము నిగ నైన ననుగ్రహింపుమని యతనినిఁ బ్రార్థించెను. గౌతముని బోధలు వినిన యశోధర కూడ నానందము పట్టలేక "ఓ మహా పురుషా! నీ యనంత ప్రేమ రాజ్యమునకు రాహులుని గూడ వారసునిగ ననుగ్రహింపుము. ఈ దీనురాలి మాట మన్నిం పుము." అని యెలుఁగెత్తి యాక్రోశించెను. గౌతముఁడు శుద్ధోదన యశోధరల ననుగ్రహించి వారిని దన శిష్యులుగఁ జేకొనెను. కొంత కాలమునకు శాక్య దేశీయు లందఱును బౌద్ధ మతమునే స్వీకరించిరి.

గౌతమ బుద్ధుఁడు పరివ్రాజకుఁ డగుటచే నతఁడొక చోట నుండక యందంద దిరుగుచు వేలకొలఁది ప్రజలను తన మత ధర్మముల నవలంబింపఁ జేసెను. శిష్యగ్రహణ మందతఁడు జాతిమత విచక్షణగాని, వర్ణాశ్రమ భేదములుగాని పాటింప లేదు. మహారాజులు, శ్రమజీవులు, ధనికులు, బీదలు, ప్రభువులు, దీనజనులు, నిరక్షరాస్యులు, మహాపండితులు కూడ నతని శిష్య గణమందుండిరి. పదపడి కొంతకాలమునకు శుద్ధోదనుఁడు మృతిఁబొందుటచే తండ్రి యంత్యక్రియ లాచరించి పుత్రుఁడగు రాహులుని బౌద్ధ భిక్షువుగ స్వీకరించి భార్యయగు యశోధరను, పినతల్లి యగు ప్రజాపతీ దేవిని సన్యాసినులుగా జేసి తన వెంటఁగొని పోయెను. ఈ విధముగ బుద్ధదేవుని సందేశము విద్యుల్లతా వేగమున నుత్తర భారత దేశమందంతటనుఁ బ్రాఁకి పోయెను.

గౌతమ బుద్ధుఁడు నలువదియైదు సంవత్సరము లీరీతిగ నా యా దేశములందు ధర్మబోధచేసెను. అతఁడును, అతని శిష్యులును సంవత్సరమున కెనిమిది మాసములు మతప్రచారము చేసి వర్ష కాలము నాలుగు నెలలును శిష్యులు తమకొఱకా యా స్థలములందు కట్టియున్న విహారములందు చాతుర్మాస్య దీక్ష నిర్వర్తించుచుండిరి.

## శ్రీ గౌతమబుద్ధుఁడు పర నిర్వాణముక్తి నొందుట.

గౌతముఁడిట్లు దీర్ఘకాలము మత ప్రచారముచేసి తన దేహపతనకాలము సమీపించినఁ దనిఁ దెలిసికొని తుది సంవత్సర మందు వైశాఖ శుద్ధపూర్ణిమనాఁటి సాయంకాలమునకు

కుశీనగరమనెడి యొక గ్రామమునకు వచ్చెను. అది కాశీ క్షేత్రమునకు నూటయిరువదిమైళ్ళ దూరమందుండును. కుశీనగర గ్రామమున కుపకంఠమున సాలవృక్షములతో నిండియున్న వనమొకటి కలదు. అచట నెడముగనున్న రెండు సాలవృక్షము నడుమఁ గుశలతో తన శయ్యనేర్పఱచుకొని దానిపై నుత్తర శిరస్సుగ నతఁడు పండుకొనెను. అపుడు తన శిష్యులను గొందఱిని పిలిచి వారితో, "భిక్షువులారా! మీకు మఱలఁ దుదిసారిగ బోధించుచున్నాను. మానవుని మానవత్వము దివ్యత్వమునకు జోటీయవలెను. అతని పార్థివ శక్తులన్నియు జ్ఞానజ్యోతియందు లయమొందవలెను. శ్రద్ధాళువులరై మిమ్ములను మీరే యుద్ధరించుకొనవలెను." అని చెప్పి యోగధారణచేసి సమాధి నిష్ఠుఁడై యానాఁటి వేకువజామున నతఁడు పరమపదము నొందెను.

*

బౌద్ధమతమునకు మన భారతదేశమే జన్మస్థానమైనను నది పుట్టినచోటకంటెఁ బ్రాచ్యఖండము నందలి యితర దేశములందు విశేషవ్యాప్తినొందెను. అది ప్రేమమతమగుటచే మతములన్నిఁటిలో మిన్నయగుచు నేఁటికి రెండువేల యైదువందల సంవత్సరములకు మించి జగత్ప్రసిద్ధమగు మతముగ విరాజమానమగుచున్నది. మానవజాతిలో మూఁడవ వంతునకుఁ బైగా గౌతమబుద్ధుని జ్ఞానబోధలను, దత్సంబంధములైన నైతిక పారమార్థిక ప్రణాళికలను నాదరించియున్నారు. అహింసా విశ్వప్రేమలను బోధించెడి యీ మహాపురుషుని సర్వోత్తమ మత మిప్పు డాసియాఖండమునందలి ప్రాచ్యద్వీప కల్పము నందును, మధ్య ఆసియా, సైబేరియా, చైనా, జపాను,

టిబెట్టు, నేపాళ దేశములందును, సింహళ ద్వీపమందును వ్యాపించి యచ్చటి ప్రజలను ధర్మప్రవర్తనుల నొనర్చినది. మన భారతదేశమందైనను మౌర్యవంశ్యుఁడగు నశోకచక్రవర్తి కాలమందు హిందూకుష్పర్వత పఙ్క్తి మొదలు బ్రహ్మపుత్రా నదివఱకును, హిమవత్పర్వతశ్రేణి మొదలు దక్షిణ పినాకినీ నదివఱకును వ్యాపించియున్న యతని సామ్రాజ్యమం దీమతము వ్యాపించియే యుండెను. రాజర్షి యగు నశోకుఁడు బౌద్ధధర్మాను సారముగఁ బ్రేమాహింసలనే యాదర్శముగ బెట్టుకొని సామ్రాజ్య పరిపాలనముచేసి దూరదేశములైన బర్మా, సిరియా, ఈజిప్టు, మాసిడోనియా, మున్నగువానినిఁ గూడ బౌద్ధధర్మ సుసంపన్నములుగ నొనర్చెను.

భారతభాగ్య విధాతయు, నవభారత స్రష్టయునగు గాంధీ మహాత్ముఁడు బౌద్ధమతము యొక్క మూలధర్మములైన యహింసను, ప్రేమను ఆచరణయందుంచుకొనుటచే నతఁ డపర బుద్ధుఁడనియే ప్రపంచ ప్రసిద్ధి వడసెను. అతని యనుయాయు లగు ప్రస్తుత స్వతంత్ర భారతదేశ పరిపాలకు లతని యహింసాది ధర్మాచరణమునకు స్మారక చిహ్నములుగ నశోక సామ్రాజ్య చిహ్నములగు చక్ర స్తూప సింహాదులను సగర్వముగ నాదరించు టయు, వానిని దమ జాతీయపతాకము నందును, నాణెపు ముద్రాశాలల యందును, తంతి తపా పనివాండ్ర శాఖాధుల యందును విరివిగ నుపయోగించుటయు మిగుల సంతోష దాయకమగు విషయము.

—

# ప్రేమ చంద్రులు

# శ్రీ చైతన్య చంద్రుఁడు

## శ్రీ చైతన్య చంద్రుని జననము, బాలక్రీడలు.

శ్రీ చైతన్య చంద్రుఁడు పశ్చిమ వంగరాష్ట్రమున 1486 సంవత్సరము ఫిబ్రవరి 18 తేదిని ప్రాచీన నవద్వీపమందు గంగా నది తూర్పుతట్టున నున్న శ్రీధామ మాయాపురమున నుదయించెను. నవద్వీపమండల మష్టదళములు, మధ్యకర్ణిక గల పద్మము వలె నుండును. మాయాపురము కర్ణిక రూపమై యంతర్ద్వీప మనఁబడు చున్నది. సీమంతద్వీపము, గోద్రుమద్వీపము, మధ్య ద్వీపము, కులద్వీపము, ఋతుద్వీపము, జహ్నుద్వీపము, మోద ద్రుమ ద్వీపము, రుద్రద్వీపము ననునవి పద్మముయొక్క యష్ట దళములవలె నంతర్ద్వీపమును జుట్టియుండును.

శ్రీ చైతన్యుఁడు జన్మించిన దినము పూర్ణిమదినము. సూర్యుఁడస్తమించిన కొలఁది కాలముననే చంద్ర గ్రహణము పట్టుచుండెను. అప్పుడు మాయాపురవాసులందఱును గంగా స్నానముచేయు చుండిరి. వారు దిక్కులు మాఱుమ్రోఁగునట్లు హరినామ సంకీర్తనము చేయుచుండఁగా నా మహాపుణ్యకాల మం దితఁడవతరించెను. ఇతని తండ్రిపేరు జగన్నాథమిశ్రుఁడు. గొప్ప సంస్కృత పండితుఁడు. ఇతని తల్లిపేరు శచీదేవి. ఈమె

నీలాంబర చక్రవర్తియనెడి పేరుగల యొక ప్రసిద్ధజ్యోతిషికుని కొమార్త. నింబవృక్షము (వేఁపచెట్టు) క్రిందజన్మించుట చేతఁ దల్లి యితనికి నిమాయి అనిపేరుపెట్టెను. పదాఱువన్నె బంగారమువలె వెలుఁగుచున్న యితని శరీరముచూచిన యిరుగుపొరుగు స్త్రీ లితనిని గౌరాంగుఁడని పిలువసాగిరి. ఇతనిశరీరమంతటను మహాపురుషలక్షణములు దోఁచుచుండెను. ఇతఁడు జన్మించిన వేళకు గ్రహములన్నియు నుచ్చస్థితియందుండెను. ఇది కనుపెట్టి యితఁడు లోకముద్ధరించుటకే జన్మించినాఁడని తెలిసికొని పితామహుఁడితనికి విశ్వంభరుఁడని నామకరణము చేసెను.

బిడ్డ కన్నప్రాశనము చేయువేళ పూర్వాచారము ననుసరించి వడ్లు, అటుకులు, మట్టియుండ, బంగారు, వెండి, శ్రీమద్భాగవతగ్రంథము నతని యెదుట నుంచబడినవి. బిడ్డఁడు తల్లియొడినుండి దిగివచ్చి తన చిన్నిచేతులతో భాగవత గ్రంథమును దాఁకెను. దీనిని బట్టి యతనికి భాగవత జీవనమందే యభిరుచి కలదని తలిదండ్రులు తెలిసికొనిరి.

ఒకనాఁడు తమ ముద్దుకొమరుఁడు శరీరము ముడుచుకొని యున్న పెనుఁబాము నొకదానినెక్కి కూర్చుండెను. ఆమహాసర్ప మతని శిరస్సుపైఁ బడగయెత్తి యాడుచుండెను. అది చూచి శచీదేవియు, జగన్నాథమిశ్రుఁడును భయభ్రాంతులై యెలుఁగెత్తి యాక్రోశించిరి. ఆసర్పము బిడ్డకెట్టి హానియుఁ జేయకుండ నతనిని మెల్లగ విడిచిపోయెను. ఆదిశేషుఁడే యీవిధముగ వచ్చి బాలచైతన్యుని సేవించెనని చెప్పుదురు. ఒకప్పు

డాచిన్ని బాలుఁడు వికునవకుండ నేడ్చుటయు, నిరుగుపొరుగు స్త్రీలందఱువచ్చి యఖండనామ సంకీర్తనముచేసి నవ్వు దూరి కుండుటయు జరుగుచుండెడిది.

ఒకనాఁడు బాలచైతన్యుఁడు తన గృహప్రాంగణమునం దా డుకొనుచుండెను. అప్పుడతని యొంటనున్న బంగారుసొమ్ములు దొంగిలింపవలెననెడి యుద్దేశముతో నిద్దఱు దొంగలు వచ్చి వానిని తమ భుజములపై నెక్కించికొని యెచటికో పోవుచుం డిరి. బిడ్డఁడు మాయాధీశుఁడగుటచే వారలకు మనశ్చాంచ ల్యము కలిగించెను. అందువలన వా రూరెల్లదిరిగి తిరిగి యెచటి నుండి బాలునెత్తుకపోయిరో, అచ్చటికే మఱల వానినిఁదెచ్చు చుండిరి. తమ ముద్దుపాపఁడు కనఁబడలేదని తలిదండ్రులతని కై వెదకుచు గన్నీరు మున్నీరుగ నేడ్చుచుండిరి. వారినిఁజూచి దొంగలాశ్చర్యమునొంది బిడ్డనచ్చటనే విడిచి పాఱిపోయిరి.

ఒకనాఁడు తనకేదోయొక గ్రంథముఁ గొని తెమ్మని జగ న్నాథమిశ్రుఁడు తన యింటిగదిలోనికి తనపుత్రునిఁ బంపెను. అతనిపాదములకెట్టి యలంకారములు లేకపోయినను బిడ్డఁడు గదిలో నడచుచుండినపుడందెల చప్పుడును, చిఱుగజ్జెల చప్పు డును నతని తలిదండ్రులకు వినవచ్చెను. తమబిడ్డ యేమొనర్చు టకు బయిటకిబోయిన వెనుక వారా గదిలోనికిఁ బోయిరి. అప్పుడు నేలపై జూడగా బాలునిపాదములు పడినచోట పద్మమును, చక్రము, అంకుశము మున్నగు దివ్యచిహ్నములు వారికగప డెను. అవిచూచి యానందపరవశులై జగన్నాథమిశ్రుఁడును, శచీదేవియు దమపుత్రుని పాదచిహ్నములకు సాష్టాంగ నమ

స్కారములు చేసిరి. తమకులదైవమగు బాలగోపాలుఁడే తమ యింట నవతరించెనని సంతోషపడసాగిరి.

మరియొకనాఁడు శచీదేవి తనచిన్న కొమరునికిఁ దినుమని కొన్ని మధురభక్ష్యముల నిచ్చెను. అతఁడవి తినుటమాని మన్నుతినుట కారంభించెను. అదిచూచి శచీదేవి యతని చేతనున్న మన్ను లాగివైచి మన్నేలతినుచుంటివని యడుగఁగా "అమ్మా! మిఠాయి మట్టియొక్క వేరొకరూపమేకదా! కనుక నీ రెంటికిని నాకు భేదముకనఁబడలేదు" అని బదులు జెప్పెను. అదివిని శచీదేవి యాశ్చర్య చకితయై, "నాయనా! ఈ వేదాంతము నీకెవరుచెప్పిరి? భక్ష్యములు తినినచో శరీరపుష్టి కలుగును. మృత్తిక తినినచో శరీరము రోగగ్రస్తమగును. కనుక నట్లుచేయఁబోకుము" అనిచెప్పెను. అదివిని యతఁడు "అమ్మా! అటులేచేయుదును. నాకాఁకలి వేసినప్పుడు నీయొద్దపాలు త్రాగెదనులే" అనిచెప్పి యామెను ప్రేమముగ్ధ నొనర్చెను.

కొన్ని దినములు పోయిన తరువాత మహాభక్తాగ్రేసరుడగు బ్రాహ్మణుఁ డొకఁడు జగన్నాథమిశ్రుని యింటికి వచ్చి యతనియాతిథ్యము నర్థించెను. జగన్నాథమిశ్రుఁ డతని నెంతయు నాదరించి వండుకొనుటకు సామగ్రి నిచ్చి యతని కొక గది ప్రత్యేకముగ నేర్పఱచెను. ఆ బ్రాహ్మణుఁడు స్వయంపాకము చేసికొని భక్తి పారవశ్యమునఁ గనులురెండు మూసికొని తన యిష్టదైవమగు బాలగోపాలునికి దానిని నివేదించు చుండెను. అప్పుడువాని చిన్న బిడ్డఁడు దొంగతనముగ నచటికి వచ్చి యాన్నమును కొంత కబళించి పాఱిపోయెను. బిడ్డ తాఁకిన యన్నము నెట్లు తినుదునని యా బ్రాహ్మణుఁడు వ్యసనపడు

చుండెను. అదిచూచి జగన్నాథమిశ్రుఁడు జాలిపడి మఱల నతనిని వండు కొనుమని చెప్పి వలయు పదార్థముల నిచ్చెను. అంతేకాక తమ బిడ్డ మఱల నచటికి రాకుండ నతఁడు కావలి యుండెను. కాని మఱల నివేదన కాలమున కు వారి చిన్ని బాలుఁ డందఱినిఁ గన్నుఁగప్పి యచ్చటికి మెల్లమెల్లగా వచ్చి నివేదితాన్నమును మఱలఁ గబళించెను. అదిగని యింటి వారందఱును మిగులఁ జింతాక్రాంతులైరి. మఱల జగన్నాథ మిశ్రుఁ డతని నెంతయు వేఁడు కొనగా నతఁడు మూఁడవ పర్యాయము వండుకొనుట కంగీకరించెను. స్వయంపాకముచేసి తొల్లిఁటి వలెనే తన యిష్టదైవమునకు వండిన పదార్థముల నతఁడు నివేదించు చుండెను. అపుడు బాల చైతన్యుఁ డతనికి మఱలఁ బ్రత్యక్ష మయ్యెను. కోపమునిఁ గనని యాబ్రాహ్మ ణుఁడు బొబ్బరించుటకు సర్వసిద్ధముగ నుండగా నతనికి వాగ్బంధము కలిగించి యాబిడ్డఁడు మందహాసముతో, "ఓయీ బ్రాహ్మణుఁడా! నీవు నామంత్రము జెప్పి నన్నుఁ బిలిచి నీవు వండిన యన్నము నా కిప్పటికి ముమ్మాఱు నివేదించితివి. నేనారగించుటకు వచ్చినప్పు డెల్లఁ బెనుబొబ్బ లిడుచుంటివి. నీ యభిప్రాయ మేమి?" యని పలుకుచు నతని ననుగ్రహింపఁ దలఁచి తన యష్టభుజగోపాల రూప మతనికిఁ జూపెను. అంతే కాక తన యవతార ప్రయోజనముగూడ నతనికి దెలిపి యీరహస్య మెవరికిఁ జెప్పవద్దని యతనిని శాసించెను. ధన్యాత్ముఁ డగునా బ్రాహ్మణుఁ డప్పటినుండి నవద్వీప మందే స్థిర నివాస మేర్పఱచుకొని యనుదినము శ్రీ చైతన్య దేవుని దర్శనము చేయుచుండెను.

ఒకనాఁ డొక భిక్షుకుఁడు మహాదేవుఁడగు శంకరుని గూర్చి పాటలు పాడుచుఁ దమ గృహద్వారమునొద్ద నిలువఁ బడెను. మనోహరమగు నతని సంకీర్తనము విని చైతన్యుఁడు తన్మయత్వము నభినయించి శంకరరూపము వహించెను. తన జన్మము ఫలించెనని యా భిక్షువతనినిఁ దన భుజములపై నెక్కించుకొని గృహ ప్రాంగణమందుఁ గొంతసే పానందతాండవము చేసెను. ఈలీల లన్నియు నా దివ్యబాలుఁడు తన యైదవ సంవత్సరము లోపలనే ప్రకటించెను.

## శ్రీ చైతన్యచంద్రుని విద్యాభ్యాసము, వివాహము.

బాల చైతన్యుఁడు తన యెనిమిదవయేట మాయాపురమునకు సమీపమందున్న గంగానగరమున గంగాదాసపండితుని పాఠశాలయందుఁ జేరెను. అచట సంస్కృత వ్యాకరణమందును, అలంకారశాస్త్రమందును రెండు సంవత్సరముల నాఁటికే పండితుఁ డయ్యెను. తదుపరి మహాపండితుఁడైన తన తండ్రి యొద్దనున్న గ్రంథముల సాయముతో దర్క వేదాంత శాస్త్రములును, స్మృతిపురాణాదులును దన యింటివద్దనే తనంతట దాను జదువుకొనెను. పదునాఱు సంవత్సరముల యీడు వచ్చువఱకు నవద్వీపమందుఁ జైతన్యునితో సమానుఁడగు పండితుఁడు లేఁడనునంతటి సర్వతోముఖ పాండిత్యము నతఁడు సంపాదించెను. పదపడి కొంతకాలమున కతని తండ్రి జగన్నాథ మిశ్రుఁడు మరణించెను. తన తల్లియపుడు దుఃఖాక్రాంతురాలై నిస్సహాయ యగుట నతఁడు గమనించెను. తల్లిని సంతోష పెట్టుటకుఁ దన గ్రామమునకు సమీపమందు నివసించుచున్న సుప్రసిద్ధ పండితుఁడైన వల్లభాచార్యుని కొమార్తయగు శ్రీమతి

లక్ష్మీప్రియాదేవి నతఁడు వివాహము చేసికొనెను. లక్ష్మీప్రియ యాదర్శగృహిణియై గృహకృత్యములు చక్కఁగ నిర్వర్తింపుచుండెను. తన భర్తను జూడవచ్చెడి పండితులకును, సన్యాసులకును, అతిథులకును సంతోషపూర్వకముగ నన్నదానము చేయుచు నత్తగారిని, భర్తను సంతోష పెట్టుచుండెను.

ఒకనాఁడు చైతన్యదేవుఁడు తర్కపండితలీల నభినయించుచుఁ దనతోఁ దర్కవాద మొనర్చుటకుఁ బండితులనెల్ల నాహ్వానింపుచు నవద్వీప పురవీథులవెంట శిష్యసమేతుఁడై తిరుగుచుండెను. అది చూచి మాయాపుర నివాసియు, బరమ భాగవతుఁడును నైన శ్రీవాస పండితుఁడను నతఁడు పిన్న వయస్కుఁడైన చైతన్యునిఁ జేర బిలిచి, "ఓయీ చిన్నవాఁడా! శ్రీకృష్ణుని, కృష్ణభక్తిని, కృష్ణప్రేమను, సంపాదించుటే జీవితప్రయోజనము కాని లౌకిక పాండిత్య సంపాదనము జీవ స్వధర్మము కాదు. అది స్వాతిశయము, దురహంకారము, విద్యాగర్వము, వాగ్వివాదము మున్నగువానిని గలిగించును. కనుక ప్రేమభక్తిని సంపాదింపుము. ఈ ప్రచారము చాలింపుము" అని బోధించెను. అంతటినుండి చైతన్యుఁడు కృష్ణప్రేమ యందాసక్తి ప్రకటించుచు దానినే ప్రచారము చేయుచుండెను.

## శ్రీ చైతన్యచంద్రుని యుపాధ్యాయవృత్తి.

శ్రీ చైతన్యుఁడపుడు గృహస్థ ధర్మమందుండుటచే నతఁ డొకపరి ప్రాచ్య వంగదేశమునకుఁ బోయి యచట కొంత కాలము దేశికవృత్తియందుండెను. అచట కృష్ణప్రేమ కలిగించెడి విద్యనే తన శిష్యులకు నేర్పుచు ధనము విశేషముగ నార్జించెను

అతఁడచటనుండిన దినములలో తపన మిశ్రుఁడనెడి బ్రాహ్మణోత్తముఁడొకఁడు చైతన్యునొద్దకు వచ్చి, "ప్రభూ ! నిన్నఁటి రాత్రి నాకొక మహాత్ముఁడు స్వప్నమున దర్శనమిచ్చి సాక్షాద్భగవంతుఁడవగు నీవలన నా జీవిత ప్రయోజనమును దెలిసికొమ్మని చెప్పి యంతర్హితుఁడయ్యెను. కనుక నీ పాదదర్శనమునకు వచ్చితిని. నాజన్మ సఫలమగుటకు నేను సంపాదించవలసిన దెద్ది ? దానికి సాధనమెద్ది ?" అని యడిగి యతని పాదములకు సాష్టాంగ నమస్కారము చేసెను. అప్పుడు మహాప్రభు వతనితో "ఓ విప్రోత్తమా ! నీ మతి కృష్ణభక్తిరస భావితముగ నున్నట్లు నేను గ్రహించితిని. కనుక నీవు ధన్యతముఁడవు. వినుము. కృష్ణశబ్దము నిర్మలప్రేమ స్థితినే నిరూపించుచున్నది. ప్రేమ యాకర్షించునంత బలవత్తరముగఁ బ్రపంచమునందే వస్తువును వేఱొకవస్తు వాకర్షింపఁ జాలదుకదా ? కనుక కృష్ణుఁడనిన నిర్మలప్రేమతత్త్వమనియే తెలిసికొనుము. కృష్ణప్రాప్తి యనినఁ బ్రేమప్రాప్తియే. భగవత్ప్రేమను సాధించుటే జన్మమెత్తినందులకు ప్రతిజీవుఁడును జేయవలసినపని. దీనిని సాధించుట కృష్ణనామసాధనము చేతనే. కనుక నో విప్రోత్తమా ! నీవు కృష్ణనామము చేసినచో కృష్ణుఁడే నీ వాఁడగును. ఇట్లు భగవత్ప్రేమను సాధించి జన్మసాఫల్యము నొందఁగలవు. కలియుగమందు హరినామ సంకీర్తనమే జీవునికిఁ దరణోపాయమని చెప్పుటకిదే కారణము. చేయువానిని వినువానిని కూడ నామము పవిత్రము చేయును. నామ సంకీర్తనము చేత కృష్ణుఁడు సంతోషించినట్లు యజ్ఞదాన తపస్సులచేత సంతోషించఁడు. వినయము, సహనము, గర్వరాహిత్యము, సర్వజన సన్మాన బుద్ధికలిగి నిరంతర కృష్ణనామ సంకీర్తనము చేయుము. అట్టి సంకీర్తన

ఫలముగ రానురాను భగవత్ప్రేమాంకురము నీ హృదయ మందుఁ బొటమరించును. నామరూప కృష్ణుఁడును, కృష్ణరూప నిర్మలప్రేమయు నొక్కటే.''

అని యీవిధముగ శ్రీ చైతన్యదేవుఁడు తపనమిశ్రునికి బోధించి కాశికిఁబోయి ప్రేమసాధన చేయుమనియు, ద్వార లోనే తానువచ్చి యతని నచ్చట కలసికొందుననియు జెప్పెను.

## శ్రీ చైతన్యచంద్రుని పునర్వివాహము.

ప్రాచ్య వంగదేశ పర్యటనము ముగించి ధనరాసులను గొనిడొని చైతన్యుఁ డింటికి వచ్చుసరికి నతని భార్యయగు లక్ష్మీప్రియాదేవి సర్పదష్టయై చనిపోయెను. అందులకు శచీ దేవి దుఃఖింపుచుండగా నామె నోదార్చి యామెయిష్టము నను సరించి రాజాస్థానపండితుఁడగు సనాతనమిశ్రుని పుత్రిక శ్రీమతి విష్ణుప్రియాదేవిని మఱలఁ బెండ్లాడెను. ఈవివాహ వ్యయమం తయు నవద్వీపవాసుఁడగు బుద్ధిమంతుఁడనెడి ప్రసిద్ధ ధనవం తుఁడొకడు భరించెను. ఈబుద్ధిమంతుఁడనువాఁడు పూర్వ జన్మమందు సువర్ణసేనుఁడనెడి పేరుతో గౌడదేశమునకు మహా రాజై యుండెను. ఇతఁడు నివసించెడి పట్టణమునకు సువర్ణవిహా రమని పేరు. ఇది శ్రీధామ మాయాపురమున కాగ్నేయ భాగ మున నాలుగుమైళ్ళదూరమం దిపుడు శిథిలావస్థయందున్న యొక పట్టణము. ఇది యొకప్పుడు గౌడదేశమునకు ముఖ్య పట్టణమై యుండెను. సువర్ణసేనుఁడు మహాభక్తుఁడగుటచే నారదమహర్షి యొకనాఁడతని రాజధానికి వచ్చెను. అతఁడు రాజునకు ప్రేమభక్తి నుపదేశింపగా నతనికి యుక్తవైరాగ్యము

కలిగెను. అందువలన నతనికిఁ కృష్ణదర్శనము చేయవలయు ననెడి ప్రబలమైన వాంఛ కలిగెను. నారదుఁడది తెలిసికొని యతనితో నిట్లనెను. "మహారాజా! కృష్ణుఁడే కలియుగ పావనావతారుఁడగు శ్రీ చైతన్యరూపమున యుగాంతరమున నవతరింప నున్నాఁడు. అతఁడు దేశమత విచక్షణ లేకుండ సర్వజనులును భగవత్ప్రాప్తి కొఱకు భగవన్నామము నెట్లు కీర్తింపవలెనో యతఁడాచరణరూపమున నెల్లరకు నుపదేశింపఁగలఁడు. నీ భక్తికి మెచ్చి నీ రాజధానికి సమీపముగనే శ్రీధామ మాయాపుర యోగపీఠమం దవతరించును. అప్పుడు నీవు బుద్ధిమంతుఁడ నెడి నామముతో నతని ముఖ్యశిష్యులలో నొకఁడవై యుందువు" అని చెప్పి వెడలిపోయెను.

## శ్రీ చైతన్య చంద్రుని శిష్య వాత్సల్యము.

పునర్వివాహము చేసికొని శ్రీ చైతన్యుఁడు మఱల నుపాధ్యాయ పదవి నలంకరించెను. అపుడు కేశవమిశ్రుఁడ నెడి మహాపండితుఁ డొకఁడు కాశ్మీరు దేశమునుండి దిగ్విజయార్థము నవద్వీపమునకు వచ్చెను. అతని ఖ్యాతివిని భయపడి నవద్వీపమునందలి పండితు లందఱును పట్టణమును విడిచిపోయిరి. పిన్న వయస్కుఁడగు చైతన్యుఁడు మాత్రము వానికి వెఱవలేదు. దిగ్విజయి తన యెదుట గంగానదిని స్తుతింపుచుఁ జెప్పిన కొన్ని శ్లోకములలో నతఁడొక శ్లోకమునం దయిదుతప్పులుపట్టి యతనిని జయించెను. తఱువాత మఱికొన్నాళ్ళ, కనఁగా నతని పదునాఱవయేట తన తండ్రిశ్రాద్ధ విధుల నాచరించు నెపమున గొందఱు శిష్యులను వెంటఁబెట్టుకొని గయా క్షేత్రమునకుఁ బోయెను. అచట ఈశ్వరపురి యనెడి భాగవత సన్న్యాసికిశిష్యుఁడై

చుతఁ డతని వలనఁ గృష్ణమంత్రము నుపదేశము పొందెను. అంతటినుండి యతఁడు కృష్ణప్రేమ రసపాన మత్తుఁడగుచు మాటి మాటికి మైమఱచు చుండెను. అచటనుండి మజిల నతఁ డింటికి వచ్చి కృష్ణప్రేమ సాధనను నసంఖ్యాకులగు తన శిష్యులకును, తల్లి శచీదేవికిని బోధించి యందఱకుఁ దరణోపాయము జూపెను. ఇతని బోధలు వినిన గృహస్థులు లంతటినుండి తమ సంసార బంధములు త్రెంపుకొనఁ జొచ్చిరి. పండితులు వాగ్వాదము మానుకొనిరి. యోగులు ప్రాణాయామాది సాధనలు విడిచిరి. జ్ఞానులు బ్రహ్మకైవల్యము కోరరైరి. అందఱును పూర్ణపురుషుఁడగు శ్రీకృష్ణుని నామరూపమున సేవించుటకే కడంగిరి. వీరేకాదు. నవద్వీప మండలి బాలురు, బాలికలు, స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు, మూఢులు, దీనులు మున్నగువారు సైతము కృష్ణనామ సంకీర్తనము చేయ మొదలిడిరి.

## శ్రీ చైతన్య చంద్రుఁడు శిష్యులకు విష్ణుస్వరూపమును, విశ్వరూపమును కనుపర్చుట.

అంతటినుండియు నవద్వీపమున ప్రతిగృహమందును రాత్రింబవళ్లు కృష్ణనామము సాగుచుండెను. కాని భజనమనినఁ దలకంటగింపుగ నున్న వా రాగ్రామమునఁ గొందఱు కలరు. ఆ నిర్భాగ్యు లఖండ భజనముచేఁ దమకు రాత్రులందు నిద్రలేదని నవద్వీపమండలాధీశ్వరుని యొద్ద మొఱపెట్టఁ దలఁచిరి. అదివిని లోగడ చైతన్యుని పాండిత్యము నధిక్షేపించిన పరమభాగవతుఁడగు శ్రీవాసపండితుఁడు తన యింటిలో నృసింహదేవుని పూజన మారంభించి యతని శరణువేఁడెను.

అట్లు నవద్వీపవాసు లందఱును భయపడుచున్నారని చైతన్యుఁడు తెలిసికొనెను. అప్పుడు తన విశ్వంభర నామము సార్థకము చేయ నెంచెను. అతఁడు శ్రీవాసపండితుని యింటికిఁ బరుగునఁ బోయి "ఓయీ! నీవెవరిని పూజించుచున్నావో, అతఁడే నీ యెదుట నిలువఁబడి యున్నాఁడు చూడుము." అనుచు శంఖ చక్ర గదా పద్మ కంఠమాలా శోభితమగు తన చతుర్భుజ విశ్వంభరరూపమును కనుపర్చెను. అదిగని ప్రేమముగ్ధుఁడై శ్రీవాసపండితుఁ డానందాశ్రువులతో విధ్యుక్తముగ నతని కభిషేకముచేసి హారతిపట్టెను. తనరూప ముపసంహరించి చైతన్యుఁడు శ్రీవాసునితో, "భాగవతోత్తమా! భక్తిరహితుల కల్లవార్తలకు నీవు భయపడరాదు. వారలనుగూడ నేను ప్రేమముగ్ధులుగఁ జేయఁగలను." అనుచుఁ జెప్పి యందులకు నిదర్శనముగ నాలుగు సంవత్సరములు వయస్సుగల శ్రీవాస పండితుని మేనగోడలగు నారాయణిని బిలిచి కృష్ణుని కొఱకొకసారి యేడువు మనెను. అప్పుడా చిన్నబిడ్డ కృష్ణప్రేమ రసపానమత్తయై యానందాశ్రువులు రాల్చుచు నృత్యమొనర్ప సాగెను.

తన చతుర్భుజ విష్ణుస్వరూపమును శ్రీవాసపండితునికి చూపిన వెనుక సర్వజ్ఞుఁడగు శ్రీచైతన్య చంద్రుఁడచటి కనతి దూరమందున్న శాంతిపురమనెడి గ్రామమునకు శ్రీవాసుని సోదరుఁడగు శ్రీరామపండితుని బంపి యచ్చటనుండి భాగవతోత్తముఁడగు శ్రీయద్వైతాచార్యుఁడను వానినిఁ బిలిపించెను. ఈ యద్వైతాచార్యుఁడు భగవదవతారమనియే నవద్వీప వాసుల విశ్వాసము. అతఁడు వచ్చిన వెనుక నొక శుభదినమున

కృష్ణుఁ డర్జునునికిఁ జూపిన విధముగ శ్రీ చైతన్యదేవుఁడు శ్రీవాసాంగణమందు తన విశ్వరూపము నతనికిఁ జూపెను. ఆ విశ్వరూపమందు రామ నృసింహ వామనాదులగు నవతారములే కాక సకల చరాచర ప్రపంచమును, దన్మధ్యమున నున్న అద్వైతప్రభువును గూడ ధన్యాత్ముఁడగు నద్వైతుఁడు దర్శించెను.

శ్రీ చైతన్యప్రభువు శ్రీవాసాంగణమందే కొంతకాలముండి తన యంతరంగ భక్తులతోఁ బ్రతిరాత్రియు నఖండ హరినామ కీర్తన మొనర్చుచు వారలకుఁ దన యవతారరూపములు కనుపఱచుచుండెను. శ్రీ వాస పండితుఁడు తన యోగక్షేమము శ్రీకృష్ణునికే విడిచి నిత్యాభియుక్తుఁడై తనయిల్లు కదలకుండెను. ఒకనాఁడు చైతన్యుఁ డతనినిఁ గని "నీవేల కుటుంబపోషణకొఱకు ప్రయత్నింపవు?" అని యడిగెను. అది విని "ప్రభూ! నా ప్రభువు వరుసగ మూఁడుదినములు నా యోగక్షేమమును గమనింపనిచో నాలుగవ దినమున నేను గంగానదిలో పడి ప్రాణత్యాగము చేయుదు" ననెను. అది విని చైతన్యుఁ డతని సర్వార్పణ బుద్ధికి మెచ్చి గాఢాలింగనము చేసెను.

శ్రీ చైతన్యచంద్రుఁడు మృతబాలుని మాటలాడించుట.

రాత్రులయందు నామసంకీర్తనము చేయునప్పుడు శ్రీ చైతన్యుఁడు తన యంతరంగ భక్తులనుదప్ప నితరులను శ్రీవాసాంగణములోనికి రానిచ్చుటలేదు ఒకనాఁడు నాస్తికుఁడగు గోపాలచపలుఁ డనెడి బ్రాహ్మణుఁడొకఁడు సంకీర్తనవేళకు శ్రీ

వాసాంగణమునఁ జొఱఁబడుచుండగా నతఁడు నిరోధింపఁబడెను. అందువలన నతనికిఁ గోపమువచ్చి శ్రీవాస గృహ ప్రాంగణ మందు మద్యమాంసాదుల నునిచిపోయెను. అతఁ డట్లొనర్చి నందులకు కొద్దిరోజులకే యతనికిఁ గుష్ఠవ్యాధి యంకురించెను. అప్పుడతఁడు శ్రీవాసపండితుని పాదములపైఁ బడెను. అతఁడు జాలిపడి క్షమించుటచే నా బ్రాహ్మణుఁడు రోగనిర్ముక్తుఁ డయ్యెను.

మఱియొకనాఁటిరాత్రి శ్రీ చైతన్య దేవుఁడును, వాని యంతరంగభక్తులును భజన చేసిచేసి కృష్ణనామ రసపానమత్తులై యుండగా శ్రీవాసపండితుని యేక పుత్త్రిఁ డాకస్మికముగఁ జనిపోయెను. ఇంటిలోని స్త్రీలు దుఃఖభారముచే గన్నీరు కార్చు చుండగా శ్రీ చైతన్యచంద్రుని తన్మయత్వమునకు భంగము కలుగునని శ్రీవాసుఁడు వారి నేడువరాదని చెప్పెను. వారు దుఃఖము నణఁచుకొని విలపించుటమానిరి. కొంతరాత్రికి భజన పూర్తియయ్యెను. అప్పుడు శ్రీ చైతన్యుఁడు శిష్యసమేతముగ నొకచోట సుఖముగఁ గూర్చుండఁగా నా మరణవార్త యతనికిఁ దెలుపఁబడెను. శ్రీవాసుని కుటుంబమువారి మనోనిగ్రహ మునకు మహాప్రభువు ప్రముదిత హృదయుఁడై యా బాలుని యాకస్మిక మరణమునకుఁ గారణ మాబాలుఁడే తెలుపవలయు నని యతఁడు సంకల్పించెను. తత్క్షణమే యా బాలుని జీవాత్మ మఱల తన శరీరమునఁ బ్రవేశించి యిట్లు సంభాషింపఁదొడంఁ గెను.

“ప్రభూ ! ప్రేమభక్తియ నెడి రజ్జువుచే నీ పాద పద్మ ములకు బంధింపఁ బడి నీకు నిత్య దాసుఁడనై యున్న నేనొక

జీవాత్మను. నీ యిచ్ఛ ననుసరించి నేనిచటికి వచ్చి పరమ భాగవతులగు శ్రీవాసపండితుని, శ్రీమతి మాలినిదేవిని నాకుఁ దలిదండ్రులుగ వరించితిని. నీ పాద పద్మములను సేవింప వలయుననెడి యాసక్తి యెంతవఱకు జీవాత్మకుఁ గలుగదో అంతవఱకు నతనికి దేహ సంబంధముగాని, ప్రపంచ సంబంధముగాని విడువదు. ఎవరు చేసిన కర్మలకు ఫలము వారే యనుభవించు చున్నారు. ప్రభూ! నీ సంకల్పము ననుసరించి యీ నా జీవయాత్ర నేటికి పూర్తియైనది. నే నిపుడు నీ యిచ్ఛాను సారముగనే మఱియొక లోకమునకుఁ బోవు చున్నాను. నీవు నన్నిటుపై నెచ్చట జన్మింపఁ జేసినను నీకు నేను నిత్యదాసుఁడనై యుండు నట్లనుగ్రహింపుము. నీకును, నీ పార్షదులకును గూడ నే నిదే దండవత్ప్రణామ మాచరించు చున్నాను. నీ యనుగ్రహమునే సదా వేఁడు కొనుచుందును."

అని చెప్పి యా జీవాత్మ తన శరీరము విడిచిపెట్టి పోయెను. అప్పు డందఱు నొక్కసారి హరిని గీర్తించిరి. ఇది వినిన పిదప శ్రీవాస పండితుని కుటుంబము వారు మృతబాలుని కొఱకు దుఃఖించుటమానిరి. "ఇటుపైని నేనే మీకుఁ బుత్రునిగ నుందు" నని యపుడు చైతన్యుఁడు శ్రీవాస పండితునికిఁ జెప్పి యతని ననునయించెను.

## శ్రీ చైతన్య చంద్రుని యమానుష లీలలు.

శ్రీకృష్ణాంశతో చైతన్య చంద్రుఁ డుదయించి నప్పుడే బలదేవాంశతో నిత్యానంద ప్రభువును, చతుర్ముఖ బ్రహ్మాంశతో హరిదాస ప్రభువును నతనితో పాటు లోకమునం దవతరించిరి. వారిరువురు నిప్పుడు శ్రీవాస మందిరమునకు వచ్చి,

చైతన్య దేవుని దర్శించిరి. వారిని జూచి యతఁడు "మిత్రులారా! మీరు నేటినుండియు నీ నగర మందింటింటికిఁ బోయి పవిత్ర హృదయములతోఁ గృష్ణనామ సంకీర్తనము చేయుమని యా బాల గోపాలమును బ్రార్థింపుఁడు. మీబోధలను వారెట్లు స్వీకరించు చున్నారో ప్రతి దినము సాయంకాలము నాయొద్దకు వచ్చి నాకుఁ దెలుపు చుండుఁడు." అని వారల కాజ్ఞాపించెను. అతని యాజ్ఞ ననుసరించి వారింటింటికిఁ బోయి కృష్ణనామ ప్రచారము చేయుచు నవద్వీప పురీవీథుల వెంటఁ దిరుగుచుండిరి. ఒకనాఁడు సురాపానము చేసిన జగ్గయ్య, మాధవయ్య యనెడి యిద్దఱు పంచమహాపాతకులు వారికెదురు పడిరి. వారు జేసెడి కృష్ణగానము విని సహింపలేక వారినిఁ గొట్టిరి. అపుడు నిత్యానందుని నుదురు పగిలి రక్తము కాఱఁ జొచ్చెను. అదివిని చైతన్యదేవుఁ డచటికిఁ బరుగున వచ్చి వారిని శిక్షింపుటకై తన సుదర్శన చక్రము నెత్తెను. అది చూచి భయపడి తమ్ము క్షమించి తమ ప్రాణములను గాపాడుమని యాపాపకర్ములు చైతన్యుని పదకమలములకు దండవత్ప్రణామ మాచరించిరి. నిత్యానంద ప్రభుని క్షమార్పణము వేఁడు కొనుఁడని యతఁడు వారల కాజ్ఞాపించెను. నిత్యానందుఁడు వారిని క్షమించుటే కాక వారినిఁ దన స్వజనములో చేర్చుకొనుమని మహాప్రభువును ప్రార్థించెను. ఇటుపైని తామెట్టి పాపములు గాని, అపరాధములుగాని చేయమని విన్నవించి వారిరువురును చైతన్యుని పాదకమలముల యెదుట దొర్లఁజొచ్చిరి. అతఁడు వారినంతట లేవనెతుటయు: బరుసవేది తాఁకుడుచే నినుము బంగారమైనట్లు వారిరువురును బవిత్రులై సద్వర్తనులై కాలక్రమమున బరమ భాగవతులైరి.

మఱియొకనాఁడు చైతన్యదేవుఁడు నవద్వీపమందు దన శిష్యబృందముతో నగర సంకీర్తనముచేసి ముగించువేళకు మట్టమధ్యాహ్నమయ్యెను. ఎండదెబ్బచేత నందఱు నలసియున్న కారణమున విశ్రాంతి తీసికొనుటకు వారొక భక్తుని యింటఁ దలదాఁచుకొనిరి. అప్పుడు చైతన్యదేవుఁ డా భక్తుని యింటి దొడ్డిలో మామిడి విత్తనమొకటి పాఁతగా ఫలములతో నిండి యున్న చూతవృక్షము క్షణకాలములో నుదయించెను. అతఁడా పండ్లనుకోసి శిష్యులకుఁ బంచిపెట్టి వారిని సేదదీర్చెను. ఇట్లే యొక సంవత్సరకాలము నగరసంకీర్తనమైన వెనుకఁ బ్రతిదినము నతఁడు చూతఫలములు పంచిపెట్టుచుండెను. ఈ స్థలమునకు "ఆమ్రమహట్ట" మని పేరు. ఇది సువర్ణసేనుని రాజధానికి సమీపమందుండును.

ఒకనాఁడు మహాప్రభువు గోద్రుమ ద్వీపమందలి యొక సరస్సులో స్నానము చేయుచుండగా నొక మొసలి యతనిని సమీపించుచుండెను. దాని నతఁడు తాఁకగనే యది యొక సుందరరూపముగల బాలునిగ మాఱిపోయెను. "నీ వెవఁడ?" వని ప్రభువతని నడిగెను. అప్పుడా బాలుఁడు, "మహాప్రభూ! నేనొక మునికుమారుఁడను. చిలిపి పనుల కలవడినవాఁడనై యొకనాఁడొక మునీశ్వరుఁ డీ సరస్సులో స్నానముచేసి నీటిలో నిలువఁబడి కనులు మూసికొని భగవత్ప్రార్థనము చేయు చుండఁగా నేనతని కాళ్ళుపట్టుకొని నీటిలోనుండి బయటికి లాగితిని. ఆతనికిఁ గోపమువచ్చి నన్ను మొసలిని గమ్మని శపించెను. శాపవిమోచన మెట్లని నేనతనినిఁ బ్రార్థింపఁగా శ్రీకృష్ణుఁడు గౌరసుందరుఁడై యవతరించి నవద్వీప ధామ

ప్రచారము చేయుచు నొకనాఁడీ సరస్సులో స్నానముచేసి నన్ను తాఁకుననియు, నప్పుడు నాకు పూర్వరూపము వచ్చె ననియుఁ జెప్పెను. ఇట్లు తన పూర్వవృత్తాంతము చెప్పి గౌరసుందరునిఁ గీర్తింపుచు నతఁడంతర్హితుఁడై పుణ్యలోకము లకుఁ బోయెను.

ఈ విధముగ నతఁడు లెక్కలేని మహిమలు కనుపఱచుచుఁ దన శిష్యుల ననుగ్రహించుచు నగరమందును చుట్టుపట్లనుండెడి గ్రామములందును రాత్రింబవళ్ళు హరినామ సంకీర్తనము చేయుచుండెను. వీరి భక్తినిఁజూచి యోర్వలేని పండితమ్మన్యులు కొందఱు చైతన్యుఁ డేర్పఱచిన యఖండ హరినామ సంకీర్తనముచే రాత్రులయందు తమకు నిద్రాభంగ మగుచున్నదని నవద్వీపమండలమున కధీశ్వరుఁడగు చండ కాజీ యొద్దకుఁబోయి మొఱవెట్టిరి. అప్పుడతఁడు నగర సంకీర్తనము నిషేధించి సంకీర్తన చేయువారి మృదంగములు పగులఁ గొట్టించెను. ఆనాఁటి రాత్రి కాజీ నిదురించుచుండఁగా సింహ ముఖముబోలు ముఖమును, మానవరూపమును గల పెనుభూత మొకటి యతనికి స్వప్నమందుఁ గనఁబడి చంపఁబోయెను. తోఁకచుక్కవలె నాకాశమునుండి యొక జ్యోతి దిగివచ్చి మృదంగములు పగులఁగొట్టిన యతని సేవకుల గడ్డములు కాల్చివైచెను. వారందఱు నిద్రలోనే "రామ! కృష్ణ! హరి!" యనుచు నవశులై భగవన్నామము చేయఁజొచ్చిరి. అట్టి హరినామ సంకీర్తనముచేఁ బవిత్ర హృదయుఁడైన కాజీ గౌరసుందరుని కలిసికొని తన యపరాధమును క్షమింపుమని బ్రతిమాలుకొనెను. కొన్నాళ్ళ కతఁడుకూడ నామసంకీర్తన

మహిమ తెలిసికొని చైతన్యదేవునికి శిష్యుఁడయ్యెను. ఇతని కుటుంబము వారుకూడఁ గొన్నితరములవఱకు కృష్ణభక్తి చేయుచుండిరి. కాజీ చైతన్యశిష్యుఁడైన వెనుక నింతకు ముందు నామ సంకీర్తనమందు విశ్వాసములేని నవద్వీపవాసులుకూడ వేలకొలఁది చైతన్యుని కనుచరులైరి. మాయాపురమునకు సమీపమందున్న కాజీసమాధి నేఁడొక పుణ్యక్షేత్రమైనది. యాత్రికులు వేలకొలఁది వచ్చి దాని నిప్పుడు కూడ దర్శించు చున్నారు. ఈ విధముగ నతఁడు తన యిరువది మూఁడవ సంవత్సరము వచ్చువఱకు నామసంకీర్తన రూపమునఁ బ్రేమ ప్రచారము చేసెను.

## శ్రీ చైతన్యచంద్రుఁడు సన్యాసము స్వీకరించుట.

చైతన్యదేవుఁ డెంతటి దయార్ద్రహృదయుఁడైనను నతని సంకీర్తన సిద్ధాంతము నంగీకరింపని యొక శత్రువర్గ మతని కేర్పడియే యుండెను. అది యతఁడు గ్రహించి పక్షపాతము, శాఖాభిమానము, సంప్రదాయాగ్రహము మున్నగునవి మానవుని నైతిక వృద్ధికిని, ఆధ్యాత్మిక వృద్ధికిని విఘ్నప్రాయములని తెలిసికొనెను. తానెంతవఱకు నొక కుటుంబమునకుఁ జెందినవానిగ భావించుకొనుచుండునో అంతవఱకుఁ దన ప్రేమ ప్రచార ప్రయత్నముల కవరోధములు కలుగుచునే యుండునని యతఁడు గ్రహించెను. కనుక తానిఁక నొక ప్రత్యేక కుటుంబిగ నుండుట మాని జగత్కుటుంబి యగుటకే యతఁడు నిశ్చయించెను. చెట్టు మొదట నీళ్లు పోసినప్పుడు దాని కొమ్మలును రెమ్మలు వికసించును. కొమ్మలపైని మాత్రము నీళ్లు జల్లినప్పుడా కొమ్మలకుఁగాని, చెట్టునకుగాని, చెట్టు మూలమునకుగాని

వికాసము కలుగదు. అయితే శ్రీకృష్ణు నొక్కనిని సేవించినప్పు
డతనినుండి బయలు వెడలిన చరాచర ప్రపంచమంతయు
సంతృప్తినొందును. మతభేదములు, కులగోత్రములు, వర్ణాశ్రమ
ములు మున్నగువానికి సంబంధించిన సంకుచిత దృష్టితో
ప్రపంచమందే కొద్ది మందినో సంతృప్తిపరచుటకు ప్రయ
త్నింతు మనుకొనుడు. అంతమాత్రమున నా స్వల్ప సంఖ్యాక
ులకు గాని, సకలభూత సృష్టికిగాని, సృష్టి కాలవాలమగు
శ్రీకృష్ణునకుగాని సంతృప్తి కలుగదు. ఇట్లు తెలిసి తన
ప్రత్యేకత నుజ్జగించి తాను జగద్వ్యాప్తుడగుటకే నిశ్చయించెను.
తాను సంసారత్యాగము చేయుదునని తొలుత తన దివ్యోన్మాద
స్థితిలో దనను గాచుచుండిన తన యంతరంగభక్తుడగు గదాధర
పండితునకును, నిత్యానంద ప్రభువునకును మాత్రము చెప్పెను.
నవద్వీపమున కిరువదినాల్గు మైళ్ళ దూరమున గంగానది
కావలనున్న కటువా యనెడి గ్రామమునకు శ్రీ చైతన్యదేవు
డేదుకొనిపోయి యచట కేశవభారతి యనెడి యొక యతి
వద్ద సన్యాసము స్వీకరించెను. అప్పుడతని కిరువదినాలుగవ
సంవత్సరము వయస్సు. అతడు సన్యసించిన తరువాత
నద్వైత ప్రభువును జూచుటకతడు శాంతిపురమునకు
వచ్చెను. అద్వైతుడు వర్తమానముచేయగా శచీదేవి
మాయాపురమునుండి తన కుమారునిజూడవచ్చెను. సన్యాసి
రూపములో నున్న కుమారునిజూచినప్పుడు శచీదేవి మనమున
నొకమారు హర్షమును, నొకమారు శోకమును గలుగు
చుండెను. ముండితశిరస్కుడును, దండకమండలధారియు నైన
చైతన్యచంద్రుడపుడు తను గన్న తల్లి పాదములపై బడి
"అమ్మా! ఈ శరీరము నీది గనుక నీయాజ్ఞలు నేను మన్నిం

పక తీరదు. ప్రేమ సాధనము చేయుటకు నేను బృందావనమునకుఁ బోయెదను. అనుజ్ఞ యిమ్ము" అని యడిగెను. అప్పుడు శచీదేవి యద్వైతుఁడు మున్నగువారితో సమాలోచనను చేసెను. తనపుత్త్రుని క్షేమవార్తలు తనకుఁ దఱచుగఁ దెలుపువారు పురుషోత్తమ క్షేత్రమందు గలరనెడి యభిప్రాయముతో నతఁడు పురుషోత్తమ (పూరీ) క్షేత్రమందుండుట కంగీకరించెను.

సన్న్యసించువఱకును నిమాయి, గౌరాంగుఁడు, విశ్వంభరుఁడు ననెడి నామములుగల శచీపుత్త్రుఁడు సన్న్యసించిన తఱువాత శ్రీకృష్ణ చైతన్యుఁడనియు, మహాప్రభువనియుఁ బిలువఁబడుచుండెను. శ్రీకృష్ణ చైతన్యుఁడనఁగా, సమస్తజీవుల హృదయము లందును కృష్ణోదయము కలిగించువాఁడని యర్థము.

తఱువాత మహాప్రభువు త్వరలోనే శాంతిపురము విడిచి పురుషోత్తమ క్షేత్రమునకు వచ్చెను అచ్చట సార్వభౌముఁ డనెడి పేరుగల యొక మహాపండితుని యింట బస చేసెను. ఆ పండితుఁడు బాల సన్న్యాసి యగు శ్రీ చైతన్యుని జగన్మోహన రూపము జూచి యాశ్చర్యచకితుఁడై యతఁడాజన్మాంతము సన్న్యాసధర్మము నిర్వర్తించుట కష్టతరమని తన శిష్యులతో ననెను. సార్వభౌముఁ డొకనాఁడు తన శిష్యులకు వేదాంతసూత్ర భాష్యము చెప్పుచుండెను. చైతన్యుఁ డది విని యతఁడు చెప్పునది సూత్రములకు సరళార్థము కాదని యతనిచే నొప్పించెను. ఏ భాష్యము నంటకుండ మహాప్రభువు సూత్రములకు సరళార్థము చెప్పెను. అది విని సార్వభౌముఁ డిటువంటి సరళార్థము తాను జన్మమెత్తిన వెనుక వినుట కిదే మొదటిసారి యని చెప్పెను. అతఁడానంద పరవశుఁడై చైతన్య

నికి నమస్కారము చేసి యతనికి శిష్యుఁడై చైతన్యుని ప్రేమ సిద్ధాంతము నంగీకరించెను. అతఁ డంతటినుండియుఁ దర్కవాదములు విడిచి ప్రేమప్రచారము చేయసాగెను.

## శ్రీ చైతన్యచంద్రుని దక్షిణభారత యాత్ర.

కొన్ని దినములు పోయిన తఱువాత దక్షిణభారత దేశమును దర్శింపఁగోరి శ్రీమన్మహాప్రభువు కృష్ణదాసుఁడనెడి విప్రునొకనిని వెంటఁబెట్టుకొని బయలుదేఱెను. అతఁడు మొదట విశాఖపట్టణ మండలమందున్న శ్రీకూర్మక్షేత్రమును దర్శించెను. అచట కుష్ఠురోగముచే బాధపడుచుండెడి కూర్మయ్య యనెడి బ్రాహ్మణుని గాఢాలింగనము చేసికొని నిరామయునిఁ జేసెను. తదుపరి యతఁడు సింహాచలమునకుఁ బోయి నృసింహదేవుని దర్శించెను. పిదప గౌతమీతీరమునఁ బ్రాక్పశ్చిమ గోదావరీ మండలముల కధీశ్వరుఁడైన రామానందరాయలును గలిసికొనెను. ఇతనినిఁ గలిసి తీరవలెనని సార్వభౌముఁడు చెప్పియుండుటచే చైతన్యదేవుఁడు గౌతమికి వచ్చి స్నానముచేసి యానదినెయొడ్డున కీఁదుకొని పోయెను. కొవ్వూరు గ్రామమున కంటియున్న గోష్పదతీరము నతఁడుచేరి యచటఁ గృష్ణనామ సంకీర్తనము చేయుచుండెను. అచటికిఁ గొందఱు విప్రులను వెంటఁబెట్టుకొని యందలమెక్కి రామానందుఁడు మంగళ వాద్యములతో గౌతమీ స్నానము కొఱకు వచ్చెను. అతఁడు పల్లకి దిగగానే పదాఱువన్నె బంగారువలె మెఱయుచున్న శరీరముగల శ్రీ చైతన్యుని జగన్మోహన రూప మతని కంటఁబడెను. వెంటనే రామానందుఁ డతనికి సాష్టాంగ నమస్కారము చేసెను. "నీవేనా రామానంద రాయలవు?" అని మహాప్రభు

వడుగఁగా నవునని యతఁడు బదులు చెప్పెను. అప్పుడు వారిరువురు నన్యోన్యము గాఢాలింగన మొనర్చి యానం దాశ్రువులను రాల్చిరి. అది చూచి యతనితో వచ్చిన బ్రాహ్మణు లాశ్చర్యనిమగ్నులైరి. తఱువాత వారిరువురు నొక రహస్యస్థలమందుఁ గూర్చుండి ప్రేమసిద్ధాంతమును జర్చించిరి. చర్చపూర్తియైన వెనుక శ్రీరామానందుఁ డిట్లనెను:— "మహాప్రభూ! నిన్ను నేను దెలిసికొంటిని. నీవు సాక్షాత్తు కృష్ణుఁడవే; ప్రేమావతారుఁడవే. సర్వజీవులకును బ్రేమప్రాప్తి యెట్లగునో నీవాచరణ రూపమున సాధన మార్గమును వారికిఁ జూపుటే నీ యవతార ప్రయోజనము. నీ దర్శన స్పర్శన సంభాషణములచే నేను ధన్యుఁడనైతిని." ఇట్లనుటయుఁ జైతన్యుఁ డతనిని మఱలఁ గౌఁగిలించి పురుషోత్తమ క్షేత్రమునకు వచ్చి తనను గలసికొమ్మని రామానందునితోఁ జెప్పి యతఁడు తన ప్రయాణమును సాగించెను.

మార్గమందు మున్ను శ్రీరామచంద్రుఁ డేసాల వృక్షముల చాటున నిలిచి వాలిని సంహరించెనో, ఆ సప్తసాలములను జైతన్యుఁడు తాఁకుటయు నవి యదృశ్యమయ్యెను. పదపడి యతఁడు మంగళగిరి, అహోబిలము, తిరుపతి మున్నగు పుణ్య క్షేత్రములను దర్శించి క్రమముగ శ్రీరంగము జేరి యచటఁ దన చాతుర్మాస్య దీక్ష గడపెను. అచట వేంకట భట్టారకుఁడనెడి భాగవతోత్తముఁడు సకుటుంబముగ నతనికి శిష్యుఁడయ్యెను.

అచటనే యమిత భక్త్యావేశముతో బ్రాహ్మణుఁ డొకఁడు భగవద్గీతా పారాయణము చేయుచుండఁగా జైతన్యుఁ

డొకనాఁడు జూచెను. అతఁ డక్షరజ్ఞానము లేకుండఁ దడవుకొనుచుఁ బారాయణము చేయుచున్నాఁడని విసిన వారందఱును నవ్వుచుండిరి. ఏమిట్లు చదువుచుంటివని చైతన్యుఁ డడుగఁగా గీతా పఠనము ప్రారంభించు సరికి తన శరీరము పరవశమగుట వలనఁ దనకుఁ దోఁచినట్లు తాను జదువు కొనుచుంటినని యతఁడు బదులు చెప్పెను. అది విని చైతన్య దేవుఁ డతనినిఁ గౌఁగిలించుకొని "అయ్యా! గీతా రహస్యము నీ కొక్కనికే తెలియును. కనుక గీతా పఠనమునకు నీ వొక్కఁడవే యర్హుఁడవు" అని చెప్పెను.

పిదప చైతన్య చంద్రుఁ డనేక దక్షిణ క్షేత్రములను దర్శించి కన్యాకుమారి వఱకుఁ బోయి పడమరకుఁ దిరిగి చంద్రభాగా నది యొడ్డుననున్న పండరినాథుని దర్శించి పండరి పుర నివాసియగు తుకారామును కృష్ణభక్తునిగఁ జేసెను. బొంబాయి దొరతనమునం దున్నతోద్యోగి యైన శ్రీ సత్యేంద్రనాథుఁ డను నతఁడు సేకరించిన తుకారామ విరచితములగు నభంగముల యందీవిషయము కలదు. ఇట్లు ప్రయాణములు చేయుచు రెండు సంవత్సరములు దక్షిణభారత దేశమందుండి మఱల చైతన్యుఁడు పురుషోత్తమ క్షేత్రమునకు వచ్చెను.

## శ్రీ చైతన్య చంద్రుఁడు ప్రేమప్రచారము చేయుట; చేయించుట

అప్పటికి కతని కిరువది యేడవ సంవత్సరము వయస్సు. మఱుచటి సంవత్సరమతఁడు మఱల వంగదేశమునకుఁ బోయెను. అప్పుడు హుస్సేన్‌షా యనునతఁడు గౌడదేశ చక్రవర్తిగ

నుండెను. అతని దొరతనమందు రూప సనాతనుల నెడి విద్యాధికులగు సోదరు లిద్దఱున్నతోద్యోగులుగ నుండిరి. వారిని శ్రీ చైతన్యదేవుఁడు శిష్యులుగ గ్రహించెను. వారికి శక్తిసంచార మొనర్చి వారలచేఁ బ్రేమభక్తి గుఱించి యమూల్యములైన కొన్ని గ్రంథములను వ్రాయించెను. అతఁడు మఱల పురుషోత్తమ క్షేత్రమునకు వచ్చి మార్గమందు శాంతిపురమునఁ దన తల్లిని శచీదేవిని దర్శించెను. అచట వాసవ దత్తుఁడనెడి యొక మహాభక్తుఁ డతనిని గలసికొనెను. వాసవ దత్తుఁడు శ్రీచైతన్యుని శిష్యులలో శిరోరత్నము వంటివాఁడు. అతఁడు కంటఁబడగానే శ్రీచైతన్యుఁ డతనినిఁ గౌఁగిలించి యతఁడెట్టి వరము గోరిన నది ప్రసాదింతునని యానంద పారవశ్యముతో ననెను. అదివిని వాసవదత్తుఁడు చేతులుజోడించి శ్రీచైతన్యచంద్రునితో "మహాప్రభూ! లోకము నందలి మానవకోటి యంతయు సంసార తాపత్రయములో బడి భగవంతుని స్మరించుట లేదు; నిన్ను భగవంతునిగ గుఱుతించుట లేదు. ఇందులకు వారొనర్చిన పాపములును, అపరాధములును గారణముగాని వేఱొండు కారణము లేదు. మానవు లిట్లు భగవంతుని మఱచి యుండుట నేను సహింపఁ జాలకున్నాఁడను. కనుక ప్రభూ! నీవు నాకెట్టి వరమునైన ననుగ్రహింతునని చెప్పితివి గావున మానవకోటి యొక్క సర్వపాపములును, సర్వానర్థములును నే నొక్కఁడనే భరించుటకు ననుజ్ఞయు, శక్తియు ననుగ్రహింపుము. మానవులందఱును సంసార కష్టములనుండి విముక్తులై భగవత్ప్రాప్తి నొంది సంతతానంద మనుభవింప నిమ్ము. నన్నీ విధముగ సార్థక జన్మునిఁ జేయుము" అని పలికెను. అది విని శ్రీచైతన్యుఁ డపరిమితానందము నొంది

"ఓయీ వాసవదత్తా! జీవుల యెడల నీకుఁ గలిగిన దయ యపారము. సర్వజీవుల నుద్ధరించుటకై నీవలె నిట్టిపరమ నెవ్వరును గోరియుండలేదు. తాత్కాలికమగు నానందము కలిగించెడి యేవేవో లోకోపకారములు చేయునట్టి పరార్థ దృష్టికలవారెందఱైన నుండవచ్చును గాని నీవలె పరమార్థదృష్టి గలవారు సృష్టియందు దుర్లభముగ నుందురు. నిన్నిప్పుడే ముక్త పురుషునిఁ జేయుచున్నాను. మానవుల కష్టములు నేనే భరింతును." అని చెప్పెను.

పురుషోత్తమ క్షేత్రమునందుఁ గొలఁది దినములు మాత్రమే యుండి చైతన్యుఁడు మఱల వెంటనే ప్రయాణమై బలభద్ర భట్టాచార్యుఁడనువానిని వెంటఁబెట్టుకొని బృందావనమునకును, అచటినుండి ప్రయాగకును బోయెను. ప్రయాగ యందుఁ గొందఱు మహాత్ములీయన శిష్యులైరి. అచటి నుండి శ్రీచైతన్యదేవుఁడు కాశీక్షేత్రమునకుఁ బోయెను. అచటఁ దపనమిశ్రుని కతిథిగ నుండి యుత్తమ ప్రేమ సాధనను మహదానందము పొందెను. కాశీక్షేత్రమందుఁ గొందఱు సన్న్యాసులు చైతన్యదేవునికి శిష్యులై నామ సంకీర్తన సాధ్యమగు ప్రేమభక్తి మార్గము నవలంబించిరి. మఱల నతఁడు కాశీక్షేత్రము విడిచి యరణ్యమార్గమునఁ బురుషోత్తమ క్షేత్రమునకుఁ బ్రయాణమై దారిలో నఖండముగ కృష్ణనామమును, కృష్ణభజనమును జేయుచు నరణ్యములో దిరుగుచుండిన పులుల చేతను, ఏనుఁగులచేతను భగవన్నామ మహాత్మ్య ఫలముగ నృత్యము చేయించుచుండెను.

## శ్రీ చైతన్యచంద్రుఁ డవతారలీల ముగించుట.

అప్పటికి శ్రీ చైతన్యునకు ముప్పది యొకటవ సంవత్సరము వయస్సు. అంతటినుండి యతఁడు ప్రపంచరంగమును విడుచువఱకును బదునెనిమిది సంవత్సరముల కాలము పురుషోత్తమ క్షేత్రమునుండి కదలకుండ కాశీమిశ్రుఁడగు నొక బ్రాహ్మణుని యింట బసచేసియుండెను. రాధాకృష్ణ తత్త్వవేత్తలును, సకలశాస్త్ర పారంగతులును, అనింద్యచరిత్రులును నగు శిష్యులెందఱో యతని నచట విడువకుండఁ గొలుచుచుండిరి. మహాప్రభుని చిన్ననాఁటి మిత్రుఁడగు స్వరూప దామోదరుఁడను నతఁ డతని కాంతరంగిక కార్యదర్శియై యుండెను. తన మండలాధికారమును విడిచి వచ్చి రామానందరాయలు స్వరూప దామోదరునికి సహకారిగనుండి శ్రీ చైతన్యదేవునిఁ గొలుచుచుండెను. వీరిరువురినే చైతన్యుఁడు తన కంగరక్షకులుగ నుండుట కంగీకరించెను. అతఁడా దినములలో స్వల్పముగ నిదురించుచుండెను. తన యనుచరులకును, దనను జూడవచ్చెడి వారలకును నతఁడు ప్రేమబోధలు చేయుచుండెను. ఒకొక్కప్పు డతఁడు కృష్ణప్రేమ రసపాన మత్తుఁడై యాడుచుఁ బాడుచు నైమఱచుచుండెను. అతనిని దర్శించినవా రందఱును లోకము నుద్ధరించుటకవతరించిన భగవంతుఁడే యని యతనిఁగూర్చి చెప్పుకొనుచుండిరి. అతఁడు సన్యాసి యయ్యును దన తల్లి నుపేక్ష సేయకుండ మాతృభక్తి గలిగి నవద్వీపము నుండి వచ్చిపోయెడి వారలచేత నామెకు శ్రీ జగన్నాథదేవుని మహాప్రసాదము పంపించుచుండెను. నిత్యానందుని వంగదేశమునకుఁ బంపి యచటఁ ప్రేమభక్తి ప్రచారము చేయించెను. ప్రసిద్ధులగు తన శిష్యుల నాలుగురను బృందావనమునకుఁ బంపి యుత్తర భారతదేశమును

ప్రేమభక్తితో నింపెను. అతఁడు వినయమూర్తి. మధురభాషి. అట్లని భగవదపరాధము చేసినవారిని శిక్షింపకుండ విడువలేదు. తన్నాశ్రయించినవారిని జాతి మత విచక్షణలేకుండ స్వీకరింపుట మానలేదు.

ఇట్లు గౌడ నభస్స్థలమందుదయించిన శ్రీ చైతన్య చంద్రుఁడు సంసార తాపత్రయ సంతప్తులపైఁ దన పదునేడవ సంవత్సరము వయస్సునుండియుఁ బ్రేమచంద్రికలు కురిపించుచుండెను. అతఁ డట్లు ప్రేమ ప్రచారముచేసి నలువది యెనిమిది సంవత్సరములు జీవించెను. 1530 సంవత్సర మందొకనాఁడు పురుషోత్తమ క్షేత్రమునఁ దోఁట గోపీనాథ దేవాలయ ప్రాంగణమందు శ్రీకృష్ణ సంకీర్తనము సాగుచుండెను. అప్పుడు తన యవతారము చాలింపఁ దలఁచి శ్రీ చైతన్య చంద్రుఁడు గర్భాలయములోని కొక్క యూఁపున జొరఁబడి శ్రీ గోపీనాథుని శ్రీ విగ్రహమం దంతర్హితుఁ డయ్యెను.



# ప్రేమ చంద్రులు

# శ్రీ మెహెర్చంద్రుఁడు

## శ్రీ మెహెర్చంద్రుని వంశము, బాల్యము, విద్యాభ్యాసము.

శ్రీ మెహెర్చంద్రుఁడు మహారాష్ట్రదేశమున పూనా నగరమందు 1894 సంవత్సరము ఫిబ్రవరి నెల 25 వ తేది ఉదయ మైదుగంటలకు పారసీకదంపతుల కుదయించెను. ఇతఁడు విశ్వమందంతట నిపుడు ప్రేమామృతమును వెదజల్లు చున్న మహాపురుషుఁడు. ఇతని జాతక చక్రమును బరిశీలించిన జ్యోతిషికు లితఁడు జగద్గురువు కాఁగలఁడని చెప్పిరి. ఇతనికి దలిదండ్రులు పెట్టినపేరు మెహెర్బాను షేరియర్జీ ఇరాని. ఇతని తండ్రిపేరు షేరియర్జీ ముండేగర్ ఇరాని; తల్లిపేరు శ్రీనిబాను; అన్నపేరు జంషర్జీ; తమ్ములపేళ్ళు జాల్బాయి, బెహ్రాము, అర్దేషిరు; సోదరిపేరు మణి. మెహెర్బానని యితనిపేరు కొన్నాళ్ళకు మెహెరను నామముగ సంకుచిత పఱుపఁబడినది.

ఇతని బాల్యమున నొక గొప్ప విచిత్రము జరిగెను. పదునొకండు మాసముల శిశువుగా నున్నప్పు డితఁడు తప్పటడుగులు వేసికొనుచు నింటిముంగిటి వాకిలిలోనికిఁ బోయెను. అచట నొక నాఁగుఁబాము కనఁబడఁగా దానితో నతఁడాడు కొనుచుండెను. ఆపాము మెహెర్చంద్రుని శరీరమును పెన

వేసికొనెను. కొంతసేపటి కతని తల్లి వచ్చిచూచి బిగ్గరగా నాక్రోశించెను. అప్పుడా నాగుబా మదృశ్యమయ్యెను. కాని యతని కెట్టి బాధయుఁ గలిగింపలేదు. ఇది యెటువంటి మహత్తర మైన విశేషమో యతని తలిదండ్రుల కప్పుడు తెలియలేదు. లోకమునందంతటను ప్రేమామృతమును వర్షించిన యవతార పురుషులగు శ్రీకృష్ణునకును, శ్రీచైతన్యచంద్రునకును నిట్టి యనుభవములే కలిగెను. శ్రీకృష్ణుడు బిడ్డగానుండిన కాల మందతఁడు కాలమనెడి సర్పముతో పెనఁగులాడెను; దాని పడగలపైఁ దాండవమాడెను. ఇది మన మెఱుంగుదుము. ఇటులే చైతన్య చంద్రుఁడును దన బాల్యమందు శరీరము ముడుచుకొని యున్న యొకనాగుఁబాముపైనెక్కి కూర్చుండెను. అప్పుడది తన పడగతో నతనికి గొడుగు పట్టెను. అవతార మూర్తులకుఁదప్ప నితరుల కాదిశేషుని సేవయు, శేషశయన మును లభింపఁగలవా ?

శ్రీ మెహెర్బాబచంద్రున కైదవ సంవత్సరము వయసున్నప్ప డక్షరాభ్యాసము చేసిరి. అతఁడు పూనా నగరమందున్నత విద్యాభ్యాసము 1911 వ సంవత్సరమునఁ బూర్తిచేసెను. జంటపూనా కర్కీ నగరములకు నడుమనున్న డక్కను కళా శాల యందతఁడు చదువుకొనెను. "హాఫీజ్" అనునొక మహాత్మ దీయకవి వ్రాసిన ప్రేమగీతికలను, పద్యములను శ్రీ మె ర్బంద్రుఁడు చదువుచుండెను. అందలి భగవత్ప్రేమ రసమును త్రాగి త్రాగి పరవశుఁడగు చుండెను. అవి చదివిన దానికి ఫలముగ నతఁడు గుజరాతీ, ఉర్దూ, హిందీ, పారసీక భాష లలోను, ఇంగ్లీషు భాషలోను చక్కని ప్రేమగీతములు

వ్రాయుచుండెను. అతనికి సంగీతమందును, సద్గోష్ఠియందును నభిలాష మెండు.

## శ్రీ మెహెర్బాబా మొదటి గురువు.

మెహెర్బాబా పక్కాను కళాశాలయందు రెండవ సంవత్సరపు దరగతిలో చదువు చుండిన కాలమున నతని చదువున కాకస్మికముగ భంగము కలిగెను. 1913 సంవత్సరము మే మాసమం దొకనాటి యుదయము మెహెర్బాబా సైకిలెక్కి పూనా నగరమున నొకవీధి వెంటఁ బోవుచుండెను. అతనికి దారిలో నొక వేప చెట్టు క్రింద కూర్చుండిన యొక ముసలి యాఁడుది కంటఁ బడెను. ఆమె మెహెర్బాబాను జూచి తన యొద్దకు రమ్మని సంజ్ఞచేసెను. అతఁడు సైకిలు దిగి యామెయొద్దకుఁ బోయెను. ఆమె లేచి నిలువఁబడి యతనినిఁ కౌఁగిలించి కనుబొమల మధ్య ముద్దు బెట్టుకొనెను. ఆక్షణ మందే మెహెర్బాబాకుఁ బ్రేమ జీవనమం దాసక్తి యుదయించెను.

ఆ ముసలమ్మ పేరు హజరతు బాబాజాను. ఆమె యాఫ్ఘను స్థానమందలి యొక సామంతరాజు యొక్క మంత్రి కూఁతురు. ఆమెకు ప్రేమభక్తి సహజసిద్ధముగ నుదయించెను. అందువలనఁ దన పిన్నవయసులో నామె వివాహమాడుట కిష్టపడలేదు. ఆమె యతిసాహసపు బ్రయాణము లొనర్చి భారతదేశమునకు వచ్చెను. క్రమముగ పూనా నగరము చేరుకొని తన యద్భుత ప్రభావముచే లెక్కలేని మందికి రోగ నివారణ చేయుచుండెను. ఆమె ప్రేమ బలమునకు మితియు,

మేరయు లేదని చెప్పుదురు. ఆమె సుమారు 141 సంవత్స రములు జీవించి 1931 సంవత్సరము సెప్టెంబరు 21 తేదిని తన భౌతిక శరీరము త్యజించెను.

బాబాజాను దర్శనముకొఱకు మెహెర్బంద్రుఁడు కొంత కాలమునఱకుఁ బ్రతి రాత్రియు నామెయొద్దకుఁ బోవుచుండెను. కాని వారొకరితో నొకరు మాట్లాడుటలేదు. ఆమె మౌనము తోనే యతని కాత్మశక్తి కలిగించుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగిన పిదప 1914 సంవత్సరమం దొకనాఁటిరాత్రి యామె మౌన ముద్ర విడిచెను. అపుడామె తన వ్రేలితో నతనినిఁ జూపించుచు "ఈ నాబిడ్డ కొన్ని సంవత్సరములు పోయిన వెనుక దన శక్తిచే లోకమునకుఁ గళ్యాణము సమకూర్చి యమితఖ్యాతి గడించును" అని చెప్పెను. అప్పుడు మెహెర్బంద్రుఁ డామె చేతిని ముద్దిడి తన యింటికిఁ బోయెను. అప్పటికి పదునొకండు గంటలాయెను. పండుకొనిన పది నిమిషములకే యతఁడు పరవశత్వము నొందెను. అతని శరీరము కంపించుచుండెను. అన్ని నరములయందును నాడి కొట్టుకొనుచుండెను. పట్టరాని యానందమును, అక్షణమందే యమితమైన బాధయుఁ గలుగుటచే నతనికి దిగులుపుట్టెను. తదుపరి యతనికి శరీరస్మృతి పూర్తిగ నశించెను. అది రోగ లక్షణమని యతని తలిదండ్రులు భావించిరి. వైద్యసాధనము కొఱకు బొంబాయిలో నున్న యతని యన్న జంషెడ్జీయొద్ద కతని నంపిరి. 1914 సంవత్సరము నవంబరు నెలలో నతనికిఁ గొంత ప్రపంచస్మృతి కలిగెను. తరువాత పూనాకువచ్చి 1915 సంవత్సరము ఏప్రెలు నెల మొదలుకొని యతఁడు ప్రయాణ ములు చేయుట కారంభించెను. తొలుత షిర్డీకిఁబోయి మహా

పురుషుఁడగు సాయిబాబాను దర్శించెను. పిదప నాతని శిష్యుఁడును, సిద్ధపురుషుఁడును నగు నుపాసనీమహారాజు నతఁడు

## శ్రీ మెహెర్చంద్రుని రెండవ గురువు.

ఉపాసనీ మహారాజు శ్రీ మెహెర్చంద్రునిఁ జూచిన వెంటనే నతని నుదుటిపై నొకచిన్న గులక రాతితోఁ గొట్టెను. అది తొలి బాబాజాను ముద్దుపెట్టుకొన్న స్థలమునఁ దగిలెను. అప్పుడు మెహెర్చంద్రునికి మఱికొంత ప్రపంచ స్మృతి కలిగెను. ఆ దినములలో నతని కనేక విధములగు దివ్య దర్శనములును, దివ్యానుభవములును గలుగుచువచ్చెను. జగత్తంతయుఁ దన కొఱకే సృజింపఁబడి నట్లును, జగత్తులో దానొక్కఁడే యున్నట్లును నతని కొకసారి యనుభవము కలిగెను. మఱియొక సారి యితఃడితర జనముల తలఁపు లన్నియుఁ దన దన మనస్సునందే కలుగుచున్న ట్లనుభవముకూడ పొందెను. ఈ యనుభవములు కలుగుచుండిన దినములో శ్రీ యుపాసనీ మహారా జతనిని దన యొద్దనే యుంచుకొని మిక్కిలి యాదరించుచుండెను.

## శ్రీ మెహెర్చంద్రుఁడు సిద్ధపురుషుఁడగుట.

1921 సంవత్సరము డిశంబరు నాఁటికతనికిఁ బ్రపంచ స్మృతి పూర్తిగా గలిగెను. అప్పుడు శ్రీయుపాసనీ మహారాజు తన శిష్యుల నందఱిని జేఁబిలిచి, "ఇదిగో! మిమ్ముల నేనిప్పుడే మెహెర్చంద్రుని కప్పగించుచున్నాను. ఇటుపైని మీరతనినే కొలువ వలెను." అని చెప్పెను. తనను జూడవచ్చిన వారితోఁ

గూడ, "ఈ బాలుఁడు (మెహెర్చంద్రుఁడు) ప్రపంచము సంతను తన ప్రేమామృతముతో నుజ్జీవింపఁజేయును. ఇతఁడు విశ్వకళ్యాణ మొనఁగూర్చును" అని చెప్పుచుండెను. కొన్ని దినములైన వెనుక నతఁడు తన ముఖ్యశిష్యు నొకనిని రావించి యతనితో "నేను మెహెర్చంద్రుని సిద్ధపురుషునిగఁ జేసితిని. ఈ యుగమందలి సిద్ధపురుషులలో నితఁడు కడపటివాఁడు. కనుక నీవు నన్ను విడిచి యతని నాశ్రయింపవలెను" అని చెప్పెను.

ఈ విధముగ మెహెర్చంద్రుఁడు తన యిరువది యేడవ యేట సిద్ధపురుషుఁడయ్యెను. అప్పటినుండియు నతఁ డందఱిచేతను "బాబా! బాబా!!" అని పిలువఁబడుచుండెను. "నాకు భగవంతుని నిచ్చినది బాబాజాను. (లోక కళ్యాణము చేయుట కొఱకు మఱల) ప్రపంచస్మృతి నిచ్చినది యుపాసనీ మహారాజు" అని యతఁడు తఱచుగఁ జెప్పుచుండుట కలదు. "మెహెర్బాబా" అనగా, అనుగ్రహశాలి యగు తండ్రి యని యర్థము.

మెహెర్చంద్రునివంటి సిద్ధపురుషులు లోకమునం దేఁబది యాఱ్గురు మాత్రమే యుందురు. వారు ప్రాచ్యదేశముల యందే యుందురు. ఈ యేఁబదియాఱ్గురిలో నయిదుగురు మాత్రమే జగత్ప్రసిద్ధి నొంది లోకముచే గుఱుతింపఁబడుదురు. తక్కిన వారు కొండగుహలలో నుందురు. కొంద ఱడవులలో నుందురు; లేదా మనుష్యులలోనే కలసియుండి తమరహస్య వర్తన మెవ్వరికిఁ దెలియకుండ మెలంగుచుందురు. పైనిఁ జెప్పిన యైదుగురు నితర సిద్ధపురుషులను దఱచుగాఁ గలసికొనుచుందురు.

రహస్యస్థలములయందు సభలు తీర్చుచు వీరు జీవుల భవితవ్య మును నిర్ణయించుచుందురు. వీరందఱును గలసి యామోదిం చిన తీర్మానములే లోక కళ్యాణముకొఱకు కమలు జరుపఁబడు చుండును. ఈ యైదుగురిలో సర్వాధికారము గలవానికి “చక్ర వర్తి” యని పేరు. మెహెర్చంద్రుఁడే చక్రవర్తి. ఇది ముందు తెలిసికొందుము.

సిద్ధపురుషుఁడైన మెహెర్చంద్రుఁడు పూనానగరమున నొకస్థలము సంపాదించి యందులో నొక కుటీరము వేయించు కొనెను. అందులో నతఁడు ప్రవేశించి తనకంతరంగ భక్తుఁడగు బెహ్రాం యనునతఁడు మాత్రము రాత్రి తనకుఁ గావలియుండుట కంగీకరించెను. ఇతరులు కుటీర సమీపమునకుఁ గూడ వచ్చుట కంగీకరింపలేదు. ఆ దినములలో నద్భుతములగు ననేక సంఘట నలు జరిగెను.

ఒకనాఁటి సాయంకాలము ముష్కరులగు నిద్దఱు పారసీక యువకులు కుటీరమునొద్దకువచ్చిరి. వారు మెహెర్చంద్రు నితో వాగ్వాదముచేసి యతఁడు లోకవంచకుఁడని నిరూపించు టకు నిశ్చయించిరి. కాని బాబాయెదుటకువచ్చిన వెంటనే వారికి వాగ్బంధము కలిగెను. వారేమియు మాటాడఁజాలక సిగ్గుపడిరి. మెహెర్చంద్రుఁడు వారికి బుద్ధిచెప్పి మందహాసము చేసెను. వారతని పాదములపైఁబడి సెలవు తీసికొని పోయిరి.

మఱియొకనాఁడు జంషెడ్. ఆర్. ఇరాని యనునతఁడు కొందఱు స్నేహితులను వెంటఁగొని మెహెర్చంద్రునిఁ జూడ వచ్చెను. మెహెర్చంద్రుఁడు సాధారణ మానవుఁడని వారి

నమ్మకము. ఇతఁడు రాత్రి కుటీరమందే కుచేష్టలు చేయుచుండునో కనిపెట్టుటకే వారు బయలుదేఱిరి. కాని కుటీరము కట్టఁబడియున్న వీధిలో వారెంత వెదకినను కుటీరము కనఁబడలేదు. మఱునాఁటి యుదయము జంషెడ్. ఆర్. ఇరాని మెహెర్చంద్రుని దర్శించెను. అతఁడు పుష్పములు, ఫలములు సమర్పించి తొలినాఁటిరాత్రి తాను జేసిన తప్పుపని యతని యెదుట నొప్పుకొనెను. మెహెర్చంద్రునికిఁ గోపము రాలేదు. కాని యపరాధ ఫలముగ నతని కేదైన యపాయము కలుగునని బాబా కొంచెము కించపడెను. ఇది జరిగిన రెండు దినములకే యతని కడగొట్టు బిడ్డ మరణించెను.

శ్రీ మెహెర్చంద్రుఁడు కుటీరములో నివసించుచున్న మొదటి మూఁడు మాసములలో నతఁడు ప్రతి యాదివారము పూనానగరము నందలి కస్బాపేఁటకుఁ బోవుచుండెను. అచటఁ దన భక్తులు తనకు చేయు సేవ నంగీకరించు చుండెను. ఒక యాదివారము నాఁ డాపేఁటవారందఱు భక్తి పరవశులై యుండిరి. అప్పుడు బాబా తన శిష్యులలో నొకరినిఁ బిలిచి యతని బైసికిలు ముక్కలు చేయించి యచట నొక నూతిలోఁ బడవేయించెను. ఇది చూచిన వారందఱు నాశ్చర్యము నొందిరి. తదుపరి బాబా తన పరివారముతో నాశ్రమమునకు మఱలి వచ్చెను. అప్పు డాశ్రమ రక్షకుఁడగు బెహీలీ కుటీరము ప్రక్కనున్న బావిలోఁ బ్రమాదవశమున బడుటయు, నతఁడు మఱల రక్షింపఁ బడుటయుఁ దెలియవచ్చెను. అప్పుడు బాబాను గొంద అడుగఁగా "నాబెహీలీని రక్షించుట

కొఱకు నేను సైకిలు నూతిలో పాఱవేయించితి"నని ప్రత్యుత్తర మిచ్చెను.

## శ్రీ మెహెర్చంద్రుని మొదటి యాశ్రమము.

1922 సంవత్సరము మే నెలలో బాబా నలువదియైదు మంది శిష్యులను వెంటఁ బెట్టుకొని కాలినడకతో పూనానుండి బొంబాయి నగరము చేరెను. అచ్చట దాదరు రాజవీథిలో నొక బంగాళా నొక సంవత్సరమున కద్దెకు తీసికొని దానికి "బాబామంజిల్" (బాబా మందిరము) అని పేరుపెట్టెను. ఇది బాబా మొదటి యాశ్రమము. ఆశ్రమ వాసులకుఁ జక్కని నిబంధనల నతఁడేర్పఱచెను. దినమున కొకసారి శిష్యులను చేరఁ బిలిచి బాబా వారితో సద్గోష్ఠి సలుపుచుండెను. బాబా కూడఁ దన శిష్యులతో నాటలాడుచు నాశ్రమము నందలి పనులను,—ముఖ్యముగ నితరులు చేయుటకు రోఁతపడునట్టి పనులను—అతఁడే స్వయముగఁ జేయుచుండెను. అతఁడిట్లు వారలకు బోధించుచుండెను.

"మీ హృదయాకాశమునఁ బ్రేమచంద్రుఁ డుదయించిన క్షణమందే ప్రపంచమంతయుఁ బ్రేమవస్తు వొక్కటే నిండి యున్నదని మీరు తెలిసికొందురు. అప్పుడు మీరు ప్రేమనే చవి జూచుచుందురు. సర్వము నీశ్వరుని సొత్తగుటచే మీరు ధనాశను చేయరాదు. మీ రేపని చేసినను లోక కళ్యాణము కొఱకును, మానవసేవా రూపముగను జేయవలెను. మిమ్ములను పోరాడవలదని చెప్పువాఁడను కాను. కాని లోకము మేలు కొఱకే పోరాడ వలసి యుండును. నేను లోక కళ్యాణ

దృష్టితో సర్వమానవ కష్టములను సహించుచున్నాను. అప్పు డప్పుడా భారములో నొక యావగింజంత భారము మీపై వేయుచుందును. అది మీ మేలు కొఱకే యగుచున్నది."

## శ్రీ మెహెర్చంద్రుడు మొదటి యాశ్రమము నెత్తివేయుట.

1923 సంవత్సరము మార్చి నెలాఖరున బాబా యాశ్రమము నెత్తివైచెను. శిష్యులలోఁ జాలమంది నిళ్ళకు బంపివైచెను. కొందఱిని మాత్రము వెంటఁబెట్టుకొని యహమ్మదు నగరమునకుఁ బోయెను. అచ్చటినుండి 1923 సంవత్సరము జూలై 1 తేదిని తెల్లవారుజామున రెండున్నర గంటలకు శిష్యసమేతుఁడై కాలినడకతోఁ బ్రయాణమయ్యెను. దారిలో దన శిష్యులు తమ తమ మతములలో నేభగవన్నామము కలదో దానిని నెమ్మదిగ నుచ్చరించు నట్లాజ్ఞాపించెను. వారితో బొంబాయి మున్నగు ననేకపట్టణములు దర్శించెను. తరువాత పారసీక దేశమునకుఁ బోయి మఱలి వచ్చెను. పిదప నేపాళ ప్రాంతీయసీమను 'మాఘు' రనెడి గ్రామమందు భక్త కబీరు సమాధిని దర్శించెను. అచ్చటినుండి కాన్పూరము చేరి శిష్యుల నందఱిని దమ తమ యిండ్లకుఁ బంపివైచెను.

## శ్రీ మెహెర్చంద్రుని రెండవ యాశ్రమము; మెహెరాబాదు.

బాబా తన ప్రయాణము సాగించి అహమ్మదు నగరము చెంతనున్న అరంగను గ్రామము చేరెను. అచట మఱల కొందఱు శిష్యులను పిలిపించుకొని 1924 సంవత్సరము మార్చి నెలలో నాశ్రమవాసము మొదలుపెట్టెను. వారికిఁ గఠినమైన శిక్షాప్రణాళిక యేర్పఱచెను. అందఱు నుదయ మాఱుగంటలకు

లేవవలెను. ఆఱు మొదలేడుగంటలవఱకుఁ దమ తమ మతానుసారము ప్రార్థనలు సలుపవలెను. ఏడెనిమిది గంటలమధ్య సాత్త్వికమగు పానీయ మొకటి త్రాగుట కిత్తురు. దుర్బలులకు బాదంపప్పు తినుట కిత్తురు. ఎనిమిది గంటల కాశ్రమకార్యములు ప్రారంభమగును. కట్టడములు కట్టుట, తోఁటలకు నీళ్ళు తోడుట మున్నగు పనులు సాగుచుండును. పదునొకండు గంటల కందఱు నన్నము, పప్పు భుజింతురు. పిదపఁ దమ బట్టలుదుకుకొని కొన్నిగంటలు విశ్రమింతురు. మధ్యాహ్నము మూఁడుగంటలకు భజన గీతములు పాడుదురు. మఱల నాలుగున్నఱ గంటలు మొదలాఱుగంటలవఱ కాశ్రమ కార్యములే సాగుచుండును. పిదప గోధుమరొట్టెలు, బంగాళా దుంపలకూర రాత్రి భోజనమునకుఁ దయారుచేయుదురు. సాయంకాలము బాబా చెప్పెడి యుపన్యాసము విందురు. రాత్రి పదిగంటల కందఱును విశ్రమింతురు. అప్పుడప్పుడు క్రీడా వినోదములు కూడ సాగుచుండును.

ఆశ్రమములో కట్టడములు పూర్తియైన వెనుక మెహెర్చంద్రుని యొద్ద లోగడ శిష్యులుగా నుండినవారు మఱల వచ్చి చేరుకొనిరి. కొందరు క్రొత్త శిష్యులుకూడఁ జేరిరి. వీరందరును జేఱిన వెనుక నాశ్రమమునకు "మెహెరాబాదు" అనెడి పేరు పెట్టిరి. ఒక పాఠశాలయు, వైద్యాలయము, కుష్ఠరోగాశ్రమము, బీదలకు శరణాలయము కూడ నిర్మింపఁ బడినవి. పాఠశాలకు "హజరతు బాబాజాను పాఠశాల" అనెడి పేరువెట్టి యందు జాతిమత విచక్షణ లేకుండ నంత్యజులను హరిజనులను గూడఁ జేర్చుకొను చుండిరి. ఒకనాఁ

డుపాధ్యాయులును, మెహెర్చంద్రుఁడును గలసి ముప్పదిమంది హరిజన బాలుర కభ్యంగన స్నానము చేయించు చుండెను. అప్పుడు బాబా దర్శనము కొఱకు కొందఱు బ్రాహ్మణులు వచ్చి వంగి నమస్కారము చేసిరి. వారినిఁ జూచి బాబా “నే నిప్పు డస్పృశ్యులకు స్నానము చేయించు చున్నాను. నేను చేసిన పని మీరు చేసి నప్పుడే మీరు నన్ను దర్శించిన ఫలము మీకు లభింపఁగలదు.” అని చెప్పెను. వారు బాబాకు దోడుపడి యస్పృశ్యులకు స్నానము చేయించిరి.

## శ్రీ మెహెర్చంద్రుఁడు మౌనవ్రతము ప్రారంభించుట.

ఇట్లు కొంత కాలము జరిగిన తఱువాత తాను మౌన వ్రతము ప్రారంభింతునని బాబా శిష్యులకుఁ జెప్పెను. మానవుఁడు లోకము కొఱ కెట్లు జీవింపవలెనో, మానవసేవ కొఱకు తమ శరీరముల నెట్లు వినియోగింపవలెనో వారికి బోధించెను. మౌనముచే నాత్మశక్తి యవ్యయమై వాక్పటిమ బలపడును. ఇతరుల ప్రాణశక్తులను నిగ్రహించుటకును, వానికి వృద్ధి లాభము కలిగించుటకును నది తోడు పడును. ఈ విషయము బాగుగఁ దెలిసిన వాఁ డగుటచే బాబా శిష్యులతో నొక నాఁ డిట్లనెను.

“మొదటి ప్రపంచ సంగ్రామమును దన యధ్యక్షత క్రింద నడపిన శ్రీ సాయిబాబా ప్రపంచరంగము విడిచెను. లోక రక్షకు రాలగు బాబాజాను మరణింప నున్నది. కనుక లోక కళ్యాణము కొఱకు నేను బాటుపడ వలసి యున్నది. ఇంతేకాక ప్రపంచ మందల్లకల్లోలములు, యుద్ధములు

కలుగును. మన దేశముకూడ ననేక కష్టము లనుభవించును. కనుక నేను నేటి నుండియు మౌనముద్ర వహింతును. నేను మౌనము విడిచి మాట్లాడు నపు డితరుల కాత్మ జ్ఞానము కలిగింపఁగల నా శక్తి విశద మగును. ప్రేమ స్వరూపముగల సత్య పదార్థమే మానవ జీవితమున కాధార భూతమనియు. నందఱిలో నుండెడి యాత్మ యొక్కటే యనియుఁ బ్రజ లప్పుడు దెలిసి కొనఁగలరు. నా వ్యవహారము, నా యాదర్శములు నాచరణ రూపముగనే ప్రజలు చూడఁగలరు. విశ్వ ప్రేమ నాచరణలో జూపి విశ్వ సోదర భావమునకు వాస్తవత్వము నిరూపింపఁ గలను. అప్పటినుండియుఁ బ్రజలు మాత్సర్యగుణము విడిచి సహకార గుణము నభ్యసింతురు. భయము నవలకు ద్రోచి దిట్టతనము నవలంబింతురు. సంకుచిత స్వభావము త్యజించి యౌదార్య గుణమునే పెంచుకొందురు. స్వార్థ పరత్వమున కంతటినుండి లోకమున స్థానమే యుండదు." అని చెప్పి 1925 సంవత్సరము జూలై 10 తేది శుక్రవార ముదయము నుండియు బాబా మౌనవ్రతము ప్రారంభించెను. అది నేటికిఁ గూడ నంతము కాలేదు. మౌన మవలంబించినది మొదలుఁ బాబా డబ్బు తన చేతితో ముట్టలేదు.

మౌనావస్థయం దున్నను మెహెర్చంద్రుఁడు ఆశ్రమ కార్యములయం దప్రమత్తుఁడుగనే యుండెను. ఒకొక్కప్పుడు బాబా యాశ్రమములో వంటకుఁ గావలసిన జొన్నపిండి తానే విసరు చుండెను; లేదా యీపని చేయు శిష్యులకుఁ దోడు పడు చుండెను. స్కూలు పిల్లల మురికిగుడ్డలు తానే కొంత కాల ముదుకు చుండెను. ఒకనాఁడు శిష్యసమేతుఁడై బాబా

యొక పోలీసు అధికారియింటికి భోజనమునకు వెళ్ళెను. ఆ యధికారి యస్పృశ్యులకును, హైందవేతరులకును నింటి వెలుపలను, బాబాకు, శిష్యులకు నింటిలోపలను భోజన మేర్పాటుచేసెను. బాబా యస్పృశ్యులపంక్తినే భుజించెను. అంతేకాక వారి వెంటఁబోయి వారి యిళ్ళను గూడఁ జూచి వచ్చెను.

శ్రీ మెహెర్చంద్రుని యుపవాస లక్షణము.

1925 సంవత్సర మక్టోబరు మొదలు బాబా యుపవాసములు చేయుట కారంభించెను. ఆహారము విడుచుట మాత్ర ముపవాసము కాదని యతని యభిప్రాయము భోగాసక్తి లేకుండుటయు, శరీరముతోఁ జేయవలసిన కార్యములు పూర్తిగ విసర్జించుటయు, నుపవాసమని యతఁడు మనకు బోధించుచున్నాఁడు. శరీరమును శుష్కింపఁజేయుట, కష్టపెట్టుట యుపవాసము కాదు. ఆత్మశక్తిని ప్రకాశవంత మొనర్చుటకుఁ జేయునదియే యుపవాసము.

శ్రీ మెహెర్చంద్రుని జ్యేష్ఠసోదరుని మరణము.

1926 సంవత్సరము ఫిబ్రవరి నెల 27 తేదిని బాబా సహోదరుఁడు జంషెడ్జీ మరణించినట్లు టెలిగ్రాము వచ్చెను. అదివిని శిష్యులు విచారించుచుండఁగా బాబా యిటనెను:—

"మృత్యు వందఱికి సమానమే. అది మఱలఁ బుట్టుకకే దారి చూపును. మనము మన శరీరమును మార్చుకొనుటయే మరణము. పాతగిల్లిన కోటు నవలకుఁ ద్రోయుటే మరణము. మృత్యువు నిద్రవంటిదే. కాని రెంటికి భేద మెచ్చటనిన, మృత్యు మూలమున మన మొక క్రొత్తశరీరమున మేల్కాందుము. నిద్రాఫలముగ మన ప్రాత శరీరమందే మేల్కాందుము. నిద్ర

పోయినవాఁడు మఱల మేల్కొనునని తెలిసి వానినిఁ జూచి దుఃఖింపరు. పెద్దనిద్ర పోయినవాఁడు కూడఁ గ్రొత్తశరీరమం దెప్పుడో యొకప్పుడు మేల్కొనును గదా ? వానినిఁ గూర్చి మాత్రము మనమేల దుఃఖింపవలెను? యథార్థమేమనిన, మనకుఁ ప్రియులైనవారి రూపము మఱల మనకుఁ గనఁబడదనియును, ఆరూపమందు మనకుఁ గల మోహము వదలకుండుట వలనను మనమేడ్చుచు మొత్తుకొనుచుందుము. మరణముగూర్చి మన మంతగా విచారింపము.

## శ్రీ మెహెర్చంద్రుఁడు శిష్యులకుఁజేసిన ముఖ్యబోధలు.

మఱియొకనాఁడు బాబా తన శిష్యుల కిట్లుపన్యసించెను. “నేను మౌనవ్రతము విడుచువఱకును మీరెవ్వరు నన్ను విడిచి పోఁగూడదు. నేను మిమ్ములను దూషించినట్లుగాని, కోపగించి నట్లుగాని, తృణీకరించినట్లుగాని, మీకుఁ గనఁబడినను మీ యాశ్రమ విధులు మీరు విడువరాదు. కామ క్రోధములకు లోఁబడరాదు. నా యుపదేశములు పాలింపుచునే యుండ వలెను. నేనెల్లప్పుడు మీ శ్రేయస్సునే కోరుచుందును.” బాబా యుపదేశములు క్రిందివిధముగ నుండును:—

1. “సాధుసాంగత్యము, మానవసేవ, భగవన్నామ సంకీర్తనము—ఈ మూఁడింటిని మించిన యోగ సాధనములు గాని, పరమార్థసాధనములు గాని లేవని మీరు జ్ఞప్తియం దుంచుకొనుఁడు. ఈ మూఁటిని మీరు సాధించినప్పు డన్ని మతముల పరిచయము మీకుఁ గలిగినట్లే; అన్ని మతముల సారము మీకుఁ దెలిసినట్లే. ధర్మశాలయందలి వికలాంగులను, వైద్య

శాల యందలి రోగులను మీరు సేవించుచున్నప్పుడు నన్నే మీరు సేవించుచున్నట్లుగ భావింపవలెను. ప్రపంచ దుఃఖము లన్నియు జనులయొక్క మనస్సునందలి చింతలచేత గలుగు చుండును. నేను త్వరలో వారి మనస్సుల నాకర్షించి వారిచింత లను నేనే భరింతునని జ్ఞప్తియం దుంచుకొనుఁడు. అప్పుడు నా యారోగ్యము చాలవఱకుఁ జెడవచ్చును. సర్వ ప్రపంచ కళ్యా ణము కొఱకుఁ బాటుపడుచున్న నా కిది యనివార్యమగు పని యే యగుచున్నది."

**2.** "నామనస్సు సముద్రమువంటిది. ప్రపంచము నందలి మంచిచెడ్డలన్నియు నా సముద్రమున లయమగుచున్నవి. మీ తలఁపులు మంచివైనను, జెడ్డవైనను వాని నన్నిఁటిని నాయందే లీనము చేసికొనఁగలను. చిన్న కాలువ లోనికి మురికినీరు ప్రవహించినప్పుడు కాలువనీరు తప్పక చెడిపోవును. ఆ మురికినీరు సముద్రములోనికిఁ బ్రవహించినపుడు సముద్రము దానిని లీనమొనర్చుకొనును. అప్పుడది పవిత్రలక్షణము నే వహిం చును. మీమనస్సులు చిన్న కాలువలు వంటివి. అందువలన మీ చెడుసంకల్పములు మిమ్ములను బాధించుచున్నవి. ప్రపంచము నందలి చెడుసంకల్పములన్నియు నామనస్సునందుఁ బ్రవేశింప నిమ్ము. సముద్రమువలె నున్న నా మనస్సు వాని నన్నిఁటిని లయముచేసి పవిత్రీకృతము చేయఁగలదు. కనుక నా లోఁతు దెలిసికొనుట మీతరముకాదు. నే నెవఁడనో తెలిసికొనుటకుఁ గూడ మీరు ప్రయత్నింపకుఁడు. మీరు నన్నుఁ బ్రేమించిన నంతియు చాలును."

**3.** "ప్రేమపూరితమగు హృదయమునందే భగవజ్జ్యోతి వెలుఁగుచుండును. ప్రేమసిక్త హృదయులు పుణ్యపాపరూప సముద్రమున మునిఁగియున్న జీవులు తరించెడి మార్గమే చూతురు. వారి పుణ్యాపాపముల నెన్నఁడును విచారింపరు. ప్రేమ ప్రాప్తియే జీవిత ప్రయోజనము. అగ్నిజ్వాలయందు మిడుత యెట్లు వెనుఁదీయకుండఁ జొఱఁబడి తప్తమగుచున్నదో, అట్లు ప్రేమాగ్నియందు జీవుఁడు తప్తమైనప్పుడే యతఁడితరుల నుద్ధరింపఁ గలిగి యుండును. ఒక వ్యక్తి వేఱొక వ్యక్తిని ప్రేమించుట, స్త్రీ పురుషు లొకరి నొకరు ప్రేమించుట మానవప్రేమ యనఁబడుచున్నది. ఇది భగవత్ప్రేమవలె బయటికిఁ గనఁబడవచ్చును. కాని మానవప్రేమ కాలువగట్లచే నియమింపఁబడిన జలప్రవాహమువలె సంకుచితమై యుండును. భగవత్ప్రేమ వరదలకాలమందు గట్లు తెగఁగొట్టి పొంగి పొరలి పాఱుచున్న నదీప్రవాహమువలె ననంత లక్షణము గలిగి యుండును. భగవత్ప్రేమ యెట్టి ప్రతిఫలము కోరునట్టిది కాదు."

**4.** సకల విజ్ఞానములకును, సమస్తకళలకును, సర్వమతము లకును,— వేయేల? ప్రపంచము నందలి సర్వవిషయములకు సంబంధించిన సమస్యల నన్నిఁటిని ప్రేమతత్త్వ మొక్కటే పరిష్కరింపఁ గలిగియుండును. ప్రేమ మహత్త్వ మెట్టిదనినఁ దమసంసారమే సర్వజగత్తని వాదించెడి వారినిఁగూడ నాకర్షించి వారలకు హృదయ పరివర్తనము సమకూర్పఁ గలిగియుండును. సాధారణ గృహస్థులు తమ సంసారకృత్యములు నిర్వహించుచు దినమున కొకగంట యైనను దమకును, దమ సంసారమునకును, ఆధారతత్త్వ మెద్దియని విచారింపనగును. అప్పుడు వారికిఁ

గాలక్రమమున సంసారమందనాసక్తి యుదయించి ప్రేమానుభవమునకు వారర్హు లగుచున్నారు.

కళాభిలాషులకుఁ గూడ ప్రేమోదయము కళాముఖము ననే కలుగుచున్నది. చిత్రపటము లిఖించువానికిఁ జిత్రలేఖనమందుఁ దప్ప దేని యందును దృష్టియుండదు. దానియందు నిమగ్నుఁడైన వాని కహంకారము మొదట కృశించి తాను తాను నశింపుటచే నపుడతని హృదయమునందుఁ బ్రేమభావ తరంగము లుదయించుచున్నవి. ఇట్లు సర్వము ప్రేమతత్వము వంకకే దారి చూపుచుండును."

మెహెర్చంద్రుఁ డాశ్రమము విడుచుట; మాటల నచ్చుట; వ్రాయుట గూడ మానుట.

1926 సంవత్సరము అక్టోబరు మాసమందు మెహెరాబాదాశ్రమము నెత్తివేచి డిశంబరు 25 తేదనాఁటికి బాబా తన పరివారముతో నచటికే మజిల వచ్చెను. 1927 సంవత్సరము జనవరి 2 తేదినుండి బాబా వ్రాయుటకూడ మానుకొనెను. తన యభిప్రాయములు తెలుపుటకై నాఁటినుండిఁయు నింగ్లీషక్షరములు గల యొక బోర్డు నుపయోగించుచుండెను. ఆ సంవత్సరము మే నెల మొదటి తేది నచటికి సమీపమందే మెహెరాశ్రమ మనెడి పాఠశాల యొకటి స్థాపింపఁబడెను.

అందు జాతిమత విచక్షణ లేకుండ నన్నికులములకు సంబంధించిన విద్యార్థులను జేర్చుకొనవలయునని బాబా యాజ్ఞాపించెను. వారలకుఁ జేయఁబడు విద్యాదానము

భారతీయుల దాస్యశృంఖలా విముక్తికిఁగూడ దోడు పడునని చెప్పెను. అచట నీయఁబడు విద్యాదాన ఫలితముగ దేశము యొక్క పురోభివృద్ధిలభించునని చెప్పెను. దేశమందు సంక్షోభము కలిగించుచున్న మతద్వేషము లిచట నీయఁబడు విద్యాఫలముగఁ బూర్తిగ నడుగంటునని చెప్పెను. సర్వమత సహానమే బోధింపఁబడుననియు, నందువలన భేదబుద్ధి, మత విద్వేషము పూర్తిగ నశించి సర్వజనాదరణీయమగు ప్రేమరూప విశ్వమత స్థాపన కవకాశ మేర్పడుననియు నతఁడు వచించెను.

దానికి శాఖగా 1928 సంవత్సరము మార్చి నెలలో ప్రేమాశ్రమ మేర్పాటు చేయఁబడెను. అచట మెహెర్చంద్రుఁడు బాలురకు ప్రేమతత్త్వము గుఱించి యుపన్యసించుచుండెను. ప్రేమాశ్రమము నందలి బిడ్డలకు వినయగుణము కలిగి హీన వృత్తులయందు రోఁత కలుగకుండుటకై తన కనిష్ఠ సోదరుని మాత్రమే సాయముగాఁగొని బాబా వారి పాకీదొడ్లను శుభ్రపఱచు చుండెను.

## శ్రీ మెహెర్చంద్రుని తపస్సు, ప్రయాణములు.

1929 సంవత్సరము ఏప్రిల్ మాసములో బొంబాయికి రెండువందల మైళ్ళదూరమందున్న పంచాగ్ని యనెడి గ్రామమునకు బాబా సపరివారుఁడై వచ్చెను. అచటికి సమీపమందున్న యొక గుహలో నతఁడు కొద్దిదినములు తపస్సు చేసెను. మఱల బొంబాయికి వచ్చి సెప్టెంబరు 20 తేదిని శిష్యసమేతముగ నచటినుండి పారసీక దేశమునకుఁ బోయెను. అచ్చట నున్నతోద్యోగీయులకును, సాధువులకును గూడ

దర్శనమిచ్చి మఱలఁ భారతదేశమునకు వచ్చి మెహెరాబాదు చేరుకొనెను. అచట నొక సంవత్సరము మాత్రముండి యతఁడు విదేశములకుఁ బ్రయాణమయ్యెను. 1931 సంవత్సరము మొదలు 1936 సంవత్సరము వఱకు శిష్యసమేతముగ మెహెర్చంద్రుఁడు ఇంగ్లాండు, అమెరికా, చైనా, ఇటలీ, స్పెయిను, ఫ్రాంసు మున్నగు దేశములు దర్శించెను.

మొదటి పర్యాయము 1931 సంవత్సరములో నతఁడు ఇంగ్లాండునకుఁ బోవుచుండె నప్పుడు తానెక్కిన "రాజపుటానా" స్టీమరులో రౌండు టేబిలు సభకు లండనునకుఁ బోవుచుండిన గాంధీమహాత్ముఁ డుండెను. శ్రీగాంధీజియు, మెహెర్చంద్రుఁడు నొకటిరెండు పర్యాయములు స్టీమరులో కలసికొని రాజకీయేతరములైన మత విషయములు, వేదాంత విషయములు మాటలాడు కొనిరి.

విదేశ ప్రయాణములు ముగించి బాబా 1936 సంవత్సరము ఫిబ్రవరి నెలలో మద్రాసు నగరమునకు వచ్చెను. ఆ సంవత్సర మతని జన్మదినోత్సవ మతని రెండవ గురువగు నుపాసనీ మహరాజు చేసెను.

## శ్రీ మెహెర్చంద్రుని నిద్రా లక్షణము.

బాబా గాఢనిద్రలో నున్నప్పుడు కూడ నేవేవియో పనులు చేయుచుండును. అతఁడు మేలుకువతో నున్నప్పు డూరకుండఁడు సరే కదా తన చెంతనున్న వారలను గూడ నూరక యుండ నీయఁడు. అతని వాతావరణము శాంతిమయముగ నుండదు. అందఱిచేత నన్ని పనులును చేయించుచు

దానిని గర్భాగారముగ నతఁడు మార్చి వేయును. గాఢ నిద్రలో నతఁడు రెండుచేతులు విధివిరామము లేకుండఁ గదపు చుండును. నిద్రలో నతని చేష్టలు చూచిన యతని శిష్యులికి నవ్వుటయు, భయపడుటయుఁ గూడ గలదు. దగ్గఱ నున్నవారి కేవేవియో ధ్వనులు కూడ వినఁ బడుచుండును. అతని శరీర స్మృతి యథా ప్రకారముగనే యుండును. ప్రపంచ జ్ఞానావస్థానము విడిచి పైయవస్థానమందుఁ బని చేయు చుండుటే యతని నిద్రాలక్షణము. అతని నిద్ర మన నిద్రవంటిది కాదు.

## (శ్రీ) మెహెర్బాబాకు యోగసిద్ధులున్నవా ?

బాబా సర్వశక్తులు కలవాఁడనుట నిస్సందేహము. కాని యతఁడు ప్రజలను జ్ఞానవంతులుగను, బుద్ధిమంతులుగను జేయుటకుఁ దన శక్తుల నుపయోగించును గాని భోగపరులు గను, ధనవంతులుగను జేయుట కతఁ డుపయోగింపఁడు.

మెహెర్బాబాకు నూతనముగ శిష్యుఁడైనవాఁ డొక నాఁడు బాబాను దర్శించెను. అతఁ డతనికిఁ జేతులు జోడించి "బాబా ! నీయద్భుత శక్తుల నుపయోగించి కొద్ది నిమిషము లలో పెద్దమేడ నొకదానిని నిర్మింపుము. ఈ యద్భుత విష యము చూచి లక్షలకొలఁది జనులు నీకు శిష్యులగుదురు. నా ప్రార్థన మన్నింపుము" అని చెప్పెను. అదివిని బాబా "ఓయీ! నీవు కోరినట్లు నేను చేసినప్పుడు నా కొక్క శిష్యుఁడును మిగు లఁడు. నీవనుకొన్న దానికి వ్యతిరేక ఫలమే లభించును. లక్షల కొలఁది మనుష్యులు నావద్దకు వచ్చుట నిజమే. కాని వారి కందఱికి సుఖముగ సంసారము చేయవలెననెడి కోర్కెయే

యుండును. కనుక వారు నావలన ధనలాభము మాత్రమే ముఖ్యముగఁ గోరుదురు. "ఒక్క నిమిషములో నింతటి మేడ నిర్మించితివి కదా? ఒక్క లక్ష ధనము నాకేల సృష్టించి యీయరాదు?" అని వారు నన్నడుగుదురు. వైరాగ్యబుద్ధి కలిగి సంసారముఁ దరించుటకు నావద్దకు వచ్చెడివారు కూడ గొందఱుండవచ్చును. కాని వారు నన్నెట్టివరము కోరుదురో నీకుఁ దెలియునా? వారిట్లందురు:- 'బాబా! నిన్నాశ్రయించి మేము బ్రతికిపోయితిమి. మా సంసారభారము నీవే వహింపుము. మా కెట్టి సాధన కష్టము జెప్పకుము. నీ యద్భుత శక్తులు వినియోగించి మా సంసారకష్టములు తొలఁగింపుము.' అని ప్రార్థింతురు. కనుక సిద్ధపురుషులు తమ యోగశక్తులను జూపి సంసారులకు బుద్ధిభేదము కలిగింపరాదు." అని యతనికిఁ బ్రత్యుత్తర మిచ్చెను.

కాని మెహెర్చంద్రునితోఁ బూర్వము చదువుకొన్న చిన్ననాఁటి మిత్రుఁ డొకఁ డొకనాఁడు బాబాను దర్శించెను. అతఁడతనికి నమస్కారమైనను చేయలేదు. ఏమన, బాబా సిద్ధపురుషుఁ డైనట్లు లతనికి నమ్మకములేదు. అతఁడిట్లనెను. "ఓయీ! మెహెర్బాను! నీవిప్పుడు సిద్ధపురుషుఁడ వైతివని యందఱు చెప్పుచున్నారు. కాని నాకు నీయందుఁ గల చనవుచేత నా విషయము నమ్మఁజాలకున్నాను. దయయుంచి నీ శక్తి నేదైన నాకుఁ జూపుము" అని ప్రార్థించెను. అతనిమాటలు విని బాబా చిఱునవ్వు నవ్వెను. నిర్హేతుకమైన కరుణ యతని యందపుడు బాబాకుఁ గలిగెను. అచటనున్న యొక ప్రాతబల్ల యొద్దకుఁ బోయి కూర్చుండి తాను జెప్పెడి విషయములు వ్రాయు

మని బాబా యతనినిఁ గోరెను. అతఁడా బల్లయొద్దకుఁ బోయి కూర్చుండుసరికి సిరాబుడ్డి బల్లపైనుండి లేచి గాలిలో నిలువఁ బడెను. అతఁడు చేతిలోఁ బట్టుకొన్న కలము చేతిలో నల్లలాడుట ప్రారంభించెను. అది చూచి భయపడి యా యువకుఁడు బాబాకు సాష్టాంగ నమస్కారముచేసి "నా యపరాధము క్షమింపుము. నీవు సిద్ధపురుషుఁడవని నమ్ముచున్నాను" అనెను. "ఇట్టి గారడి చేయుటకు మన దేశమం దైంద్రజాలికు లెందఱో కలరు. నన్ను వారిలోఁ గలిపితివే!" అని నవ్వుచు బాబా యతనితో ననెను.

బొంబాయి నగరమునఁ బారసీక దంపతు లిద్దరు బాబాకు ముఖ్య శిష్యులుగ నుండిరి. వారి బిడ్డ కొకనాఁ డాకస్మికముగ జబ్బుచేసి యది యధిక మగుచుండెను. తమ బిడ్డ ప్రాణము గాపాడుమని వారు రాత్రింబవళ్ళు బాబాను బ్రార్థింపఁజొచ్చిరి. అప్పుడు బాబా పారసీక దేశమందుండెను. ఒక నాఁటిరాత్రి బిడ్డకు పూర్తిగ స్మృతి తప్పిపోయెను. సర్వము నిరాశ చేసికొని వారు బాబాను దలఁచు కొనుచు తమ బిడ్డచెంతఁ గూర్చుండిరి. అప్పుడు మెహెర్చంద్రుని రూపము వారి కన్నుల యెదుటఁ గనఁబడెను. బాబా తన రెండు చేతులతో బిడ్డ నాశీర్వదించి యదృశ్యుఁ డయ్యెను. ఆక్షణము నుండియు రోగము తిరుగుదలకు వచ్చి రాను రాను బిడ్డకు సంపూర్ణారోగ్యము కలిగెను. తరువాత కొన్ని నాళ్ళకు బాబా స్వదేశమునకు వచ్చెను. "దేశాంతర మందుండియు నానాఁడు బిడ్డను రక్షించుట కెట్లు స్వయముగ రాఁగలిగితి" వనియొక శిష్యుఁ డతని నడిగెను. అప్పుడు బాబా యిట్లనెను.

"సిద్ధపురుషుల కిది యొక మహత్కార్యముకాదు. వేలకొలఁది
మైళ్ళ దూర మందున్నను సిద్ధపురుషుఁ డన్ని స్థలములయందు
నొకే కాలమునఁ దన శిష్యులకుఁ బ్రత్యక్షముకాఁ గలఁడు.
దేశకాలము లతని కవరోధములు కావు. క్రీస్తు ప్రభువొకే కాల
మందు తా ననేక స్థలములలోఁ దన శిష్యులకు దర్శన మీయ
లేదా ? కాని వారికిఁ గనఁబడునది శరీర రూపము మాత్రమే
కాని శరీరము కాదు." అని ప్రత్యుత్తర మిచ్చెను. యోగ
శక్తులను ప్రకటించుట చిన్నపిల్లల యాట వంటిదని బాబా
యప్పు డప్పు డనుచుండును.

తన యద్భుతశక్తుల ప్రకటనమందు బాబాకుఁ గొంచె
మైనను దృష్టిలేకపోవుట నిజమే. అయినను బాబా యొక పరి
యమెరికా దేశమందలి న్యూయార్కు పట్టణమునకుఁ
బోయినప్పు డతఁ డొనర్చిన యొక యద్భుత హృదయ
పరివర్తన గుఱించి క్రింద వివరించుచున్నాను :—

"అచట నొక గృహమందు బాబా బసచేసి యుండగా
గొందఱు భక్తు లతని దర్శనమునకు వచ్చిరి. వారిలో నొక
రష్యాదేశపు స్త్రీ యుండెను. ఆమె బాబాను సమీపించుటకు
సిగ్గుపడుచుండెను. అది గ్రహించి బాబా తన యొద్ద కామెను
దీసికొని రమ్మని యచటి వారి నాజ్ఞాపించెను. అప్పుడు
కొంత కష్టముపైని మిక్కిలి బిడియముతో నామె బాబాను
సమీపించెను. అప్పుడు బాబా తన యక్షరముల బోర్డు
తీసికొని "నీకు సాయము చేసెదను" అని యామెతోఁ జెప్పెను.
కాని దాని యర్థమామె యపుడు గ్రహింపలేదు. తఱువాత
నొక యద్భుత విషయము జరిగెను. ఆమె కిరువది సంవత్స

రముల వయస్సుగల యొక కొమార్తగలదు. ఆమె యందామె కపరిమితమైన ద్వేషము కలిగి యుండెను. వారిరువురును తగవు లాడుకొనుచుఁ దిట్టుకొనుచుండెరి. ఒకరి మొగ మొకరు చూచుటలేదు. కాని బాబా దర్శనము చేసిన మఱునాటి యుదయ మామె హృదయము ప్రేమపూరిత మయ్యెను. ఆమె తన్మయావస్థలో నుండెను. అందులకుఁ గారణ మామె గ్రహింపఁ జాలకుండెను. ఆమెకపుడు తన కొమార్తను చూడవలయునని నెట్టియాశ పుట్టెను. వెంటనే యా ప్రేమా వేశముతో నామె యొద్దకుఁ బోయి తనను క్షమింపుమని కొమార్తను వేఁడుకొనెను. తల్లిని జూడగానే కొమార్తకు గూడ హృదయమందు మార్పు గలిగి యామెను కౌఁగిలించెను. అంతటినుండి తల్లియు, గొమార్తయు నన్యోన్యప్రేమ కలిగి యుండిరి. చవుటి నేలలో ప్రేమ బీజములు మొలపించినది బాబాయొక్క ప్రేమశక్తియే కదా?

బాబాతో ప్రత్యక్ష సంబంధము గలవారిలో ననేకుల కిట్టి యాంతరంగికములగు మార్పు లేవేవియో గలుగుచునే యుండును. బాబాను చూడగానే కొందఱికి వర్ణింప నలవికాని హృదయ పరివర్తన కలిగి ప్రేమోద్రేక ముచేఁ గొంద ఱఱచుటయు, నేడ్చుటయు గూడ గలదు. బాబాయొక్క సాన్నిధ్యముచే నందఱికిని సర్వ సాధారణముగఁ గలుగునది భగవత్ప్రేమ భావమే.

శ్రీ మెహెర్చంద్రుని విదేశ ప్రయాణము లందలి మహా సంఘటనలు.

1931 సంవత్సరము నుండి 1936 సంవత్సరము వఱకు బాబా తన పరివారముతో విదేశ సంచారము చేసి యుండెను కదా? అచటి భక్తులను గొందఱి నతఁ డనేక విధములుగ ననుగ్రహించెను. అది మనము తెలిసి కొన్నప్పుడు మనకుఁ బ్రేమ వృద్ధి కలుగును. కనుక నతని లీలలు కొన్ని క్రింద నొందు పఱచు చున్నాను:—

**1.** అమెరికాలో నొక శిష్యునకు విశ్వరూప సందర్శన మొసంగుట.

అమెరికాలో క్యాలిఫోర్నియా పట్టణ నివాసిని యగు జీన్ అడ్రియల్ (Jean Adriel) అను నామె రోగ పీడితయై శల్యావశిష్టముగ నుండెను. ఆమె బాబాను స్మరించినది మొదలారోగ్యము లభించెను. ఆమె బాబాకు ముఖ్య శిష్యురాలయ్యెను. ఆమె యింట బాబా నివసించి యుండిన దినములలో నామె భర్త మాల్కొము (Malcolm) అను నతఁడు బాబాను దర్శించెను. కాని యతనికి శిష్యుఁ డగుట కంగీకరించ లేదు. తనకు గురువుతో పని లేదని యతఁ డనుచుండెను. బాబా వారి యింటికి వచ్చిన పండ్రెండవ నాఁడు వారియింట నున్న వారందఱు నారాత్రి పండుకొనఁ బోవు నప్పుడు తననే స్మరించుచుఁ బండుకొన వలెనని యాజ్ఞాపించెను. అతనిని స్మరించుటకు మాల్కొమున కిష్టములేదు. అయినను నతఁడే మాటిమాటి కతనికి స్మరణకు వచ్చుచుండెను. ఆ స్మరణ

తప్పించు కొనుట కతఁడు తన భార్యను దలఁచు కొనుచుఁ బండుకొనెను. కాని నిద్ర పట్టువేళకు బాబాయే మఱల స్మరణకు వచ్చుటచే నతఁడవశుఁడై బాబాను స్మరించుచుఁ బండుకొనెను.

రాత్రి సుమారు పండ్రెండు గంటలవేళకు శ్రీకృష్ణుఁ డర్జునునికిఁ జూపిన విధముగ బాబా మాల్కొమునకు దన విశ్వరూపముఁ జూపెను. వెంటనే తెలివి వచ్చి యతఁడు రోదనము చేయఁ జొచ్చెను. నోటివెంట మాట రాకుండెను. విశ్వరూప సందర్శనముతో బాబా యెవరో, అతని యవతార ప్రయోజనమేమియో యతనికిఁ స్పష్టపడెను. అప్పు డతనికి సర్వ సందేహ నివారణమయ్యెను. బాబాను సేవించుటకంటె తన జీవితమునకు వేఱొక ప్రయోజనమే లేదని యతఁడు గ్రహించెను. మఱునాటి యుదయ మతఁడు బాబా దర్శనమునకుఁ బోయి "ఓ బాబా? నిన్న రాత్రి నీవు నాకు దర్శన మిచ్చినట్టు లందఱికి నీవేల దర్శన మీయరాదు? అప్పుడు మఱి యుద్ధములు, దేశోపద్రవములు ప్రపంచమందుండవు కదా?" అనెను. అదివిని బాబా చిఱునవ్వు నవ్వి యతనినిఁ గౌఁగిలించెను.

**2.** తన యుపాధిని విడిచి దివ్యదేహముతో విహరించుట.

తన ప్రియ శిష్యురాలగు జీన్ ఆడ్రియలును వెంటఁ బెట్టుకొని బాబా సపరివారుఁడై న్యూయార్కు నగరమునుండి బోస్టను నగరమున కొకనాఁడు ప్రయాణము చేయుచుండెను.

వారందఱు రెండు బస్సులలో నిండి యుండిరి. ఒక బస్సులో బాబా ప్రక్క నతని శిష్యురాలు కూర్చుండెను. ప్రయాణము కొంతదూరము సాగినపైని బాబా యొక నీలి వస్త్రము తన నెత్తిపై ముసుఁగు వేసికొనెను. వెంటనే యతని శరీరము ప్రాణములేని దయ్యెను. అది చూచి యామె భయపడుచు నిశ్చేష్టురాలై యటులే కూర్చుండెను. మఱి యైదు నిమిషముల కతని శరీరము కదలఁజొచ్చెను. బాబా మఱలఁ దన శరీరములోఁ బ్రవేశించెను. అతఁడు తన శరీరము సరుదుకొని తన ముసుఁగు దీసి శిష్యురాలివైపు చూచెను. ఆమె యతని కన్నులుచూచి యవి యేయే దివ్యదర్శనములు చేసి వచ్చెనో యని వింతపడఁ జొచ్చెను. వారానాఁడు బస్సు ప్రయాణము చేసిన పదిగంటల కాలములో బాబా యథమము పండ్రెండు పర్యాయములు తన శరీరమును విడిచి పోవుటామె గ్రహించెను. కొన్ని దినములు పోయిన తఱువాత బాబా యీవిషయమై తన యంతరంగభక్తులతో నిట్లనెను :— "లోకము నందలి సిద్ధ పురుషులు సదా లోకకళ్యాణము కొఱకే పాటుపడు చుందురని మీకుఁ జెప్పియుంటిని కదా? వారు తఱచుగ సభలు చేయుచుందురు. నా యాలోచనలు తెలిసికొనుటకు నన్ను మాటి మాటికి పిలుచుచుందురు. వారల యాహ్వానము నేను మన్నింపక తీరదు. నా ప్రయాణములకు దేశకాలము లడ్డకుండునట్లు నా శరీరమును నేను మాటి మాటికి విడిచి పోవలసి యుండును." అని సమాధానము చెప్పెను.

### 3. తనదర్శనము నెన్నఁడు చేయని వ్యక్తి నొకని ననుగ్రహించుట.

క్యాలిఫోర్నియా సముద్రపుటొడ్డునఁ గార్మెల నెడి పట్టణ మొకటి కలదు. అచట నొక గొప్ప వైణికుఁడు కలఁడు. అతఁడు తన పూర్వజన్మఫలముగఁ దన పుట్టుకతోడనే విద్యావంతుఁ డయ్యెను. సంగీతశాస్త్రమం దతఁ డమిత ఖ్యాతి గడించెను. అతఁడు కచేరీలకుఁబోయి వీణ వాయించుచుండిన దినములలో గ్రహచారవశమున మనోవైకల్యము కలిగెను. అందువలన నతని ప్రసిద్ధి తగ్గిపోవుచుండెను. నానాఁటి కతనికి నలుగురిలో నగుఁబాటు కలుగుచుండుటచే నతఁడు కచేరీలకుఁ బోవుట మానుకొనెను. మానభంగముకంటె మరణమే మేలని యతఁడు భావించెను. పట్టరాని దుఃఖముతో నొకనాఁడతఁడు సముద్రపుటొడ్డునకుఁ బోయి సముద్రములోబడి యాత్మహత్య చేసికొనఁ దలఁచెను. అప్పుడు సముద్రపుటొడ్డునఁ గూర్చుండిన యతని మిత్రుఁ డొకఁడు బాబా రచించిన "రహస్యోద్బోధనలు" (Silent Revelations) అనెడి చిన్న గ్రంథమును భక్తి పారవశ్యముతోఁ జదువుచుండెను. అతఁడు బాబా యనుగ్రహమున కంతకుముందే పాత్రుఁడై యున్నట్టివాఁడు. తన వైణిక మిత్రుఁడు తనను సమీపింపఁగానే మరణసంకల్పమును దెలుపుచున్న యతని ముఖము చూచెను. ఏమి యిట్లుంటివని యతని నడిగినను నతఁడు మాఱు పలుకలేదు. తన మిత్రుఁడు గొప్ప కష్టములోనున్నట్లు మాత్రము గ్రహించి తన చేతనున్న పుస్తక మతనికిచ్చి "నీవు దీనిఁ జదువుము. నీకుత్సాహము, మనోవికాసము కలుగును" అని చెప్పెను. అతఁడు పుస్తకము విప్పఁగానే

యందులోనున్న బాబా చిత్రపటము కంటఁబడెను. తత్క్షణమే యతని మనోవైకల్యము నిర్మూలమయ్యెను. అతఁడానందముతో, "బాబా నాకు దేవుఁడు; అతఁడే నాలో బ్రవేశించి నాచేత వీణ వాయింపించును. నాకష్టము లతఁడు నివారించు"ననెను. ఆ పుస్తకము పట్టుకొని యతఁ డింటికిఁ బోయెను. తరువాత కొద్దిదినములకే క్యాలిఫోర్నియాపట్టణమునఁ గాటకచేరీ యొకటి జరిగెను. ఇతఁడు కార్మెలునుండి యచటికిఁబోయి వీణ వాయించెను. అది విని శ్రోతలానందపరవశులై యతనిని మాటిమాటి కభినందింపఁజొచ్చిరి. వాయించుచున్నంతసేపు బాబా దివ్యతేజోమయమైన ముఖ మతని కన్నులయెదుటఁ దాండవమాడుచుండెను. బాబా చైతన్యశక్తి యపుడతని శరీరమున వ్యాపించియుండెను. అతఁ డొడలెరుంగక వీణా తంత్రులపై వ్రేళ్ళు నడపుచున్నపుడును, కంఠమెత్తి పాడునప్పుడును, వినువారల హృదయములకుఁ గలిగిన యానందపారవశ్యము వర్ణనాతీతమై యుండెను. అతని నందఱుఁ బొగడుచున్నను దనకన్నుల యెదుట వెలుఁగుచుండిన బాబాముఖమునే యతఁడు చూచుచు బాబా సాన్నిధ్యమునే యతఁడనుభవించుచుండెను. శ్రీమెహెర్చంద్రు నెన్నఁడు జూడనివారుకూడ నతనిని స్మరించి యతనికాత్మ సమర్పణము చేసినప్పు డతఁడు వారి నెట్లుద్ధరించునో యీ వైణికుని యుదాహరణము పట్టి మనము సులభముగఁ దెలిసికొనఁగలము.

**4.** ఇటలీలో నశరీర ధారులగు సాధువులతో సభచేయుట.

1932 సంవత్సరమందు బాబా తన పరివారముతో నిటలీదేశ సంచారము చేయుచుండెను. అచ్చట అస్సిసీ

(Assisi) యనెడి నగర మొకటి కలదు. అచట నుండిన యొక గుహలో ప్రేమ భక్తుఁడగు సెయింటు ఫ్రాంసిసు (Saint Francis) అను నతఁడు చాల కాలము క్రిందట ప్రేమ సాధనము కొఱకు తపస్సు చేసి యుండెను. బాబా యచటికిఁ బోయి యా గుహలోఁ గొంతకాలము తపస్సు చేసెను. అతఁడు తపస్సు చేయు చుండిన దినములలో నొకనాఁ డాగుహలో సంకుల శబ్దములు విన వచ్చుచుండెను. గుహయొద్దఁ గావలియున్న వారు తమ కతఁ డిచ్చిన యనుజ్ఞ మఱచి లోపలికిఁ దొంగి చూచిరి. అప్పుడు సూర్యుని యెదుట గన్నులు మూసికొని నిలువఁబడి బాబా యేమేమియో యుచ్చరించు చుండెను.

ఇది జరిగిన కొన్నాళ్ళకు బాబా యీ విషయమై తన పరివారముతో నిట్లనెను:—"ఆ నాఁడా గుహలో రహస్య సమావేశ మొకటి జరిగెను. కొందఱు సాధుపురుషులు, సిద్ధ పురుషులు తమ తమ శరీరముల నొక చోట విడిచి తమ దివ్య శరీరములతో నా సభ నలంకరించిరి. వారందఱు నాతో సంప్రదించి రాఁబోవు రెండువేల సంవత్సరములకు సంబంధించిన మానవుల భవిష్యత్తు నా సభలో నిర్ణయించిరి." అని సమాధానము చెప్పెను.

**5.** ఫ్రాంసులో స్త్రీ పౌరసత్వ సమస్యను పరిష్కరించుట.

ఫ్రాంసులో బాబా సంచారము చేయుచుండిన కాల మందొక నాఁడతఁడు కొందఱు పాశ్చాత్య స్త్రీలను, కొందఱు భారతదేశపు ఘోషాస్త్రీలను వెంటఁ బెట్టుకొని పారిసు

నగరమునకుఁ బోయెను. అచట నతఁడొక శిష్యుని యింట వారలతో బసచేసెను. ఆ నగర సమీపమున "సేను" అనెడి నది యొకటి పాఱుచుండును. ఆ నదీతీరమందు బాబా వారలతోఁ గొన్ని దినములు విహరించుచుండెను. స్త్రీలందఱును నగరము యొక్క సౌందర్యము దిలకించుచుండిరి. ఘోషా స్త్రీలకు బాబా యా యా దృశ్యములను శ్రద్ధతోఁ జూపుచుండెను.

అచ్చట ఇఫ్ఫెల్‌టవ (Eiffel Tower) రనెడి యొక కట్టడము కలదు. అది తొమ్మిదివందల తొంబది యడుగుల యెత్తుగలిగిన ప్రపంచ ప్రసిద్ధిగల మహోన్నత గోపురము. అందులో నొకనాఁటి రాత్రి బాబా సాధుపురుషులతో సభ చేసెను. ఆ సభలో చేసిన తీర్మానము ననుసరించి పారిసు నగరమందలి స్త్రీలకు మాత్రమే కాక స్త్రీజాతి కంతటికిఁ గూడ నున్నతస్థితి కల్పింపఁబడెను. అంతటినుండి పారిసు నగరమందలి స్త్రీలయొక్క స్వేచ్ఛా విహారము పూర్తిగా నిరుద్ధమయ్యెను. ఆదర్శప్రాయురాండ్రగు ఘోషా స్త్రీల దర్శన మొకటియు, సాధువుల యాశీర్వచనఫల మొకటియు, నిందులకుఁ గారణము. పదపడి కొన్ని సంవత్సరములకే ఫ్రెంచి దొరతనము వారు కూడ వ్యభిచారము శిక్షార్హమగు నేరముగఁ బరిగణించిరి; అచటి పురుషులతో స్త్రీలకుఁ గూడ సమానమగు హక్కులు గలిగించిరి. బాబా చేయుచుండిన లోకోపకారము వర్ణనాతీతము.

**6.** ఒక అమెరికను యోగికిఁ దనమనస్సు నెఱుంగుట కనుజ్ఞ నిచ్చుట.

శ్రీ మెహెర్బాబాచంద్రుఁ డమెరికాలో నున్నప్పుడు హ్యారీ బార్నహార్టు (Harry Barnhart)అనెడి వ్యక్తి యతని దర్శనమునకు వచ్చెను. ఇతఁ డితరుల మనస్సులలో నుండెడి సంకల్పములను దెలిసికొనఁగలఁడు. ఈ శక్తి యితనికిఁ జిన్ననాఁటనే లభించినది. ఇతనికి బాబా మనస్సునందలి సంకల్పములు తెలిసికొనవలె ననెడి కోరిక కల్గెను. అందువలన నమితమైన యుత్సాహముతో నితఁడు బాబాయొద్దకు వచ్చెను. తన మనస్సును శోధించుటకు బాబా యతని కనుజ్ఞ నిచ్చెను. కాని యతఁడెంత ప్రయత్నము చేసినను బాబా మనస్సితి నతఁడు తెలిసికొనలేక పోయెను. బాబా మనస్సులో నెట్టి సంకల్పములు లేనందునఁ దాను దెలిసికొనుట కేద్దియుఁ గనఁబడలేదని చెప్పెను. మీఁదు మిక్కిలి బాబా తన మనస్సునందలి ప్రతి సంకల్పమును, ప్రతి భావమును స్పష్టముగఁ దెలిసి కొనుచున్నాఁడని యతఁడు చెప్పెను. ఇందు విషయమై శిష్యులొకసారి బాబానడుగఁగా నతఁడిట్లనెను:—"అవును. మీకున్న మనస్సువంటిది నాకు లేదు. నాది ప్రేమమయమును, విశ్వాత్మకమును నగు మనస్సు. నామనస్సు నెఱుంగఁగోరు వాఁడు నావలెనే విశ్వప్రేమ మయుఁడై విశ్వమంతయు నిండిన మనస్సు గలవాఁడై యుండవలెను." అని సమాధానము చెప్పెను.

శ్రీ మెహెర్బాబాచంద్రుఁడు భారతదేశ భవితవ్యమును జెప్పుట.

బాబా మన భారతదేశముఁ గుఱించి తన శిష్యులతో నొకనాఁ డిట్లు ప్రసంగించెను:— "భారత దేశ మాత్మ శక్తి సంపన్నమగు దేశము. యుగ యుగముల నుండియు సద్గురువు

లకును, సాధు పురుషులకును నది స్థానమగుచున్నది. కనుక నది ప్రపంచమందు ధన్యతమమైన దేశము. అది యిప్పుడు విదేశీయుల పాలఁబడి యున్నది. దేశసంపద యంతయుఁ గోల్పోయి కష్టస్థితిలో నున్నది. కాని యది సిద్ధపురుషులకుఁ బుట్టినిల్లగుటచే దానికి సర్వోచ్చస్థితియే లభించుచున్నది. వారలయాత్మశక్తియు, నాత్మప్రభావము దానిని సదా కాపాడుచునేయున్నది. కనుక కష్టపరంపర లనుభవించుచున్నను భారతదేశము తేజోహీనము కాఁజాలదు. కష్టములకు చరమఫలము స్వతంత్రప్రాప్తియు, నఖండానందానుభవము నని తెలియవలెను. స్వతంత్రసౌఖ్యము యొక్క విలువ దాస్యకష్టముల ననుభవించిన గాని మనము తెలిసికొనఁజాలము. మన దేశముయొక్క కష్టములు త్వరలో నివారణ కావలయునన్న మనము శత్రువులయెడలను, మిత్రుల యెడలను సమానముగు ప్రేమ కలిగి యుండవలెను. మత సామరస్యమును మన మామోదింపవలెను. శాంతిగుణమును, సహన గుణమును మన మవశ్య మభ్యసింపవలెను. ఇంతే కాక భారతీయు లితరుల దోషములను నిరూపించి పలవించుటకంటె దమ లోపములు తాము సవరించుకొనుటయే మేలు. భారతదేశమునకుఁ గలిగెడి స్వాతంత్ర్యము శాంతిప్రదము, సౌఖ్యప్రదము నగుటయే సర్వసమ్మతమగు విషయము. అట్లగుటకు దేశమునందలి రాజకీయవర్గములవా రొకరి యెడల నొకరు ద్వేషబుద్ధి కలిగి యుండరాదు. వా రొకరితో నొకరు కలహింపరాదు. వారల సంకుచిత స్వభావము నిర్మూలము కావలెను.

**శ్రీ మెహెర్బాబా ప్రేమోన్మత్తుల కాశ్రమ మేర్పఱచుట; వారిని గలసి కొనుట.**

అహమ్మదు నగరమున కిరువది మూఁడు మైళ్ళ దూరమున రాహురి యనెడి పట్టణ మొకటి కలదు. అచ్చట బాబా ప్రేమోన్మత్తుల కొక యాశ్రమము నిర్మించెను. వారికి బాబా స్వయముగ నన్నము తినుపించుటయు, స్నానము చేయించుటయు. వస్త్రధారణము చేయించుటయు జరిపించు చుండెను. వీరి కందఱకుఁ బ్రత్యేక కుటీరములు నిర్మించి సమస్త సదుపాయములు చేయుచుండెను. ఈ ప్రేమ రసపాన మత్తులకు శరీర స్మృతి యతిస్వల్పముగ నుండును. సాధారణ మానవులు వారి తత్త్వమును దెలిసి కొనఁ జాలరు. వారి మనస్సుల నెఱిఁగి వారి కనుకూలముగ వర్తింపఁ జాలరు. వారు తమ శరీర ధారణ పోషణములను గూర్చి తలఁపరు. తఱుచుగ ననారోగ్య స్థలముల యందు నివసించు చుందురు. దినముల కొలఁది యాహారము తినక పోయినను వీరు దృఢ శరీరులై యుందురు. వీరి శరీరారోగ్య స్థితి వైద్య శాఖాధికారులకుఁ కూడ నాశ్చర్యము కలిగించు చుండును. పిచ్చి వాండ్రవలె వీరు బయటికిఁ గనఁబడు చున్నను లోకమునకుఁ గళ్యాణ స్థితి కలిగినప్పుడు సంతోషించు చుందురు. లోకమున కుపద్రవము కలిగి నప్పుడు కలఁత నొందుదురు. ఆ యుపద్రవము తప్పించుట కుపాయము కూడ నాలోచించు చుందురు. ఏమన మన మనస్సులవలె గాక వీరి మనస్సులు విశాలములై భగవంతుని కధీనములై యుండును.

వీరి కెట్లయిన శరీర స్మృతి పూర్తిగఁ దెప్పించి వీరి మూలమున లోకమున కంతటికినిఁ గళ్యాణము సమకూర్చవలె

నని బాబా యభిప్రాయము. ఇదే మెహెర్చంద్రుని యవతార ప్రయోజన మందలి విశిష్టత. ఉర్దూభాషలో వీరికి "మస్తు" లని పేరు. ఈ ప్రేమోన్మత్తులు బాబాను దర్శించి నంతనే కొందఱు పరవశత్వము నొందుదురు. కొంద ఱాలుంగ త్తి యతని గుణ సముదాయమును వర్ణింతురు. మొత్తము మీఁద నందఱును దమ యానందమునే యతని యెదుటఁ బ్రకటింతురు. ఇందులకుఁ గారణము మెహెర్చంద్రుఁ డిట్లు తెలుపుచున్నాఁడు:—

"వారికి జ్ఞాన నేత్ర ముండుటచేత నా యథార్థ స్వరూపము యొక్క దర్శనము వారు చేయఁగలరు. నే నెవఁడనో వారు తెలిసికొనఁ గలరు. అందు వలనఁ గలిగిన యానందమును వారు ప్రకటింతురు. మానవ నేత్రము నా యథార్థ స్వరూపమును దర్శింపఁ జాలదు. మానవుల మాంస నేత్రములకుఁ గనఁబడునవి యీ కుర్చీలు, బల్లలు, సోఫాలు మాత్రమే."

## శ్రీ మెహెర్చంద్రునిఁ గూర్చి ప్రేమోన్మత్తుల ప్రమాణ వాక్యములు.

మెహెర్చంద్రుని దర్శించి నంతనే కొందఱు ప్రేమోన్మత్తులు పరవశత్వముతోఁ బలికిన వాక్యములు క్రింద పొందుపఱచఁ బడినవి:—

(1) "సృష్టి యంతయు మెహెర్బాబాలోనే యున్నది. సర్వజీవులకు నతఁడే ప్రభువు. తన సమస్త శిష్యుల హృదయములలోఁ గూడ నతఁడే యున్నాఁడు. అతఁడే జగద్రూపము వహించినాఁడు. ఊర్ధ్వ లోకములును, అధోలోకములును గూడ నతఁడే. అతఁడు నాలో నున్నాఁడు. అందఱిలో నున్నాఁడు.

అతఁడు సాధు పురుషులకు ప్రభువు. భారతభూమి యంతయు నతని కనుకంటి చూపులో నిమిడి యున్నది."

—భోర్యాలా బాబా (భోక్); జనవరి 1947.

(2) " (తన స్నేహితునికి హితము చెప్పుచు) నీవు బాబాను విడిచిపోఁ దలఁచితివా? నీ కంధువలన నేమి మేలు కలుగును? జగత్తంతయు బాబా యధీనమందే యున్నది. కనుక నీ వెచటికిఁ బోఁగలవు? అతని నిప్పుడే సేవింపుము. అతఁడు సముద్ర ప్రాయుఁడు. జనులందఱు నతనిని దర్శించుటకు వచ్చెడి శుభ దిన మొకటి రానున్నది. అప్పుడు నీ వతని నెట్లు కలసి కొనఁగలవు? కనుక నీ తరుణము వ్యర్థము సేయకుము."

—చట్టి బాబా (నాగపట్టణము); 1940-41

[1940 సంవత్సరము జూను నెల ప్రారంభములో నితఁ డొకనాఁడు తన నెత్తిమీఁద మట్టి పోసికొనుచుండెను. ప్రపంచమంతయుఁ గష్టసాగరమున మునిఁగియున్నదనియు, గూటికి లేక యెందఱో చనిపోవుచురనియు జెప్పెను. తుదకు బాబాయే ప్రపంచ కష్టములను నివారణ చేయునవనియుఁ గూడ చెప్పెను. ఆ నెల 9 తేది నితఁడు పిచ్చెత్తినవానివలె నావేశముతో బాబా గదిలోఁ బ్రవేశించెను. తన యిల్లు పూర్తిగాఁ గాలిపోయినదనియు, తలదాఁచు కొనుటకు వచ్చితిననియు నతనితో చెప్పెను. అతఁడు నివసించెడి కుటీరము సురక్షితముగనే యుండెను. కనుక నతని మాటలు వినినవారందఱు నాశ్చర్యము నొందిరి. బాబా కొంతసేపటి కతని నెట్లో శాంతపఱిచెను. మఱునాఁడు తన శిష్యులను పిలిచి బాబా యిట్లనెను:— "చట్టి బాబాకు ఫ్రాంసు దేశముతో నాత్మసంబంధము కలదు. ఇప్పుడు రెండవ ప్రపంచయుద్ధము జరుగుచున్నది కదా? ఈ నెల 5 తేదిని ఫ్రెంచి సైన్యము పరాజయము నొందుటయు, జర్మనులకు పారిసు నగరము వశమగుటయు చట్టిబాబాకు బాగుగఁ దెలిసిన విషయము. పారిసునగరము పతన మగుటచేఁ దన యిల్లు కాలిపోయెనని యతఁ డనుచుండెను." అని వారికిఁ దెలియఁజెప్పెను.]

3. "ఇంతకుముందు నీవలె నా హృదయము నాకర్షించిన వారెవ్వరును లేరు. నా హృదయమందు ప్రేమబాణముఁ జొనుపుటకు నీవే మొదటివాఁడవు. మూఁతపడియున్న సర్వ మానవ హృదయ ద్వారములను బగులఁగొట్టి వానిలో ప్రేమరసము వెల్లువలుగాఁ బాఱింపఁగల యమితశక్తి నీకుఁ గలదు. నీ వెవఁడవో, నీ వెంతటివాఁడవో, ప్రపంచమునం దెవ్వరు నెఱుంగరు. సిద్ధపురుషుల కందఱికి నీవు చక్రవర్తివి. నేను చనిపోయిన తఱువాత నీ సేవ చేయుచు నీవద్ద నుండుటకు మఱియొక జన్మ మెత్తఁ గోరుచున్నాను."

— పీరు ఫజల్ షా (కోట); 12 అక్టోబరు 1946

4. "నీవు అల్లా (దేవుఁడ)వు. సృష్టియంతయు నీనుండియే బయలు వెడలినది. నీ సృష్టిలీలలు నీవు స్వయముగ దర్శించుటకు వేయి సంవత్సరముల కొక పర్యాయము నీ వవతరించుచుందువు."

— అజింఖాన్ బాబా (మధుర); 14 అక్టోబరు 1946

5. "(బాబా శిష్యునితో) మీ సద్గురువు చాల గొప్పవాఁడు. క్రీస్తు ప్రభువు, మహమ్మదుకంటెఁ గూడ గొప్పవాఁడు. ప్రపంచమంతయు నతని నాశ్రయింపఁ గలదు."

— చోటు మియన్ (సంగమనేరు); 1 జూను 1948

6. "బాబా సమస్త సృష్టికి ప్రభువు. సృష్టిభారమంతయుఁ దన భుజస్కంధమున వహించి యున్నాఁడు."

— కేశవానంద మహారాజు (హృషీకేశము); ఏప్రెల్ 1964

7. "నీవు ముక్త పురుషుఁడవై కూడ లోకము నుద్ధరించుట కొఱకు నీ యిచ్ఛ ననుసరించి మజల లోక వ్యవహారము చేయుట కనుగ్రహించినావు."

— మియాన్ సాహెబు (అజంతా); నవంబరు 1944

8. "జగత్తు నందలి సకల దేశములును బాబా చేతులలో బంతులవలె నున్నవి. రష్యా, జర్మనీ మున్నగు దేశము లన్నియు నతఁడెట్లా జ్ఞాపించిన నట్లే నడచుకొను చుందును."

— పఠాన్ మస్తు (బొంబాయి); 1942

9. "(స్త్రీ శిష్యపరివారముతో దేవాలయము నొద్ద నున్న బాబాను చూచి) ఇదిగో చూడుఁడు! శ్రీకృష్ణుఁడే గోపికా సమేతుఁడై వచ్చియున్నాఁడు."

— ఒకా నొక ప్రేమోన్మత్తుఁడు (బృందావనము; 28 జనవరి 1939.

10. "(ఒక వీధిలో బాబాను జూచి) అదిగో చూడుఁడు. శంకరుఁడు వచ్చినాఁడు. మీరందఱు దర్శనము చేసికొనుఁడు."

— ఒకా నొక ప్రేమోన్మత్తుఁడు (అజ్మీరు); ఫిబ్రవరి 1939.

* * *

బాబా తన యంతరంగ శిష్యులతో నిప్పటి కిరువది యెనిమిది సంవత్సరముల నుండియు నాశ్రమ వాసము చేయు చున్నాఁడు. తన శిష్యులకు ప్రపంచ బుద్ధి వదలించుట కతఁ డిపుడాశ్రమ వాసము విడిచిపెట్టినాఁడు. వారికి పూర్తిగ వైరాగ్యము కలుగుటకై యే స్థలమందును వారిని విశేష కాలముంచుటకు బాబా యంగీకరింపలేదు. 1949 సంవత్సరము

అక్టోబరు 16 తేదినుండి కొందఱు శిష్యులను వెంటఁబెట్టుకొని యతఁడు బెల్గాము, కాశి, సారనాథము జానపురము, మురాదాబాదు, డెహ్రాడూను, సతారా, మహాబలేశ్వరము మున్నగు గ్రామములు దర్శించినాఁడు. అతఁడిపుడు శిష్య సమేతుఁడై హైదరాబాదు (దెక్కను)లో విడిసి యున్నవాఁడు. 1951 సంవత్సరము అక్టోబరు 16 తేది నుండి తన యంతరంగ భక్తుల మనోనాశనము కొఱకుఁ దాను సాధన చేయుచున్నాఁడు. భగవద్భక్తియు, భగవత్ప్రేమయు నూటికి నూరుపాళ్లు మనసును కలిగి యుండినఁ గాని యమనస్కస్థితి సంపాదన మసంభవమని బాబా యభిప్రాయము. శతవర్ష తపస్సాధనచేఁ గలుగని మనోనాశము క్షణమాత్ర సాధు సాంగత్యముచేఁ గలిగి తీరుననియు, సాధుపురుషుల యొక్కయు, సిద్ధపురుషుల యొక్కయు సాహాయ్యము లేకుండ నితర మార్గములచే మనోనాశము సిద్ధింప నేరదనియు బాబా మనకుఁ జెప్పుచున్నాఁడు. "సజీవుఁడగు సద్గురుని సర్వార్పణ బుద్ధితో సదా స్మరించు నతని స్వాంతమునందలి సంకల్పములను సద్గురుఁడే సమయింపఁ గలఁడు." ప్రేమ సముద్రుఁడగు శ్రీ మెహెర్చంద్రుని బోధలన్నిఁటిలో నిదియే శిరోరత్నము.

---

